# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక



☆ ☆ ☆

ఓం శ్రీపరమాత్మనే నమః

# సర్వోత్తమ సాధన

## 1. మానవ జన్మయొక్క దుర్లభత - భగవత్ప్రాప్తిలో ఈనాడు ఎదురౌతున్న కొన్ని విఘ్నాలు - వాటిని తప్పించుకొనే ఉపాయాలు

### దుర్లభమైన మనుష్యజీవనం - మన కర్తవ్యం

**మా**నవజీవితం చాలా దుర్లభమైంది. గొప్ప పుణ్య సంచయం వల్ల, భగవత్కృపవల్ల ఇది మనకు లభిస్తుంది. దీనికి సంబంధించిన ప్రతిక్షణాన్నీ భగవత్స్మరణలో, భగవత్సేవలో గడపాలి. కాని బహు విచారకరమైన విషయమేమంటే ఇప్పటికే మన కాలమంతా వృధాగా గడిచిపోయింది. ఇప్పుడూ అలాగే గడిచి పోతూనే ఉంది. కాబట్టి ఇప్పుడైనా తెలివి తెచ్చుకొని భవిష్యత్తులో పశ్చాత్తాప పడాల్సి రాకుండా మనకర్తవ్యాన్ని నిర్వర్తించుకొంటూనే మనుష్యజన్మని సఫలం చేసుకోవాలి.

కాబట్టి ప్రతిక్షణం క్షీణించిపోయే ఈ అమూల్య జీవితసమయాన్ని ఎంతవరకు సదుపయోగం చేసుకొన్నామన్నది మనం ఆలోచించాలి. జీవుడు జననమరణాల నుండి శాశ్వతంగా విముక్తి పొంది పరమాత్మను చేరుకొనే విధంగా ఉపయోగపడేది మానవ శరీరం మాత్రమే. ఇలా మనం నిర్లక్ష్యంతో ఈ దుర్లభమైన మానవజీవితాన్ని పశువుల్లాగా ఆహార నిద్రామైథునాదులలో నిమగ్నం చేసే పక్షంలో మన జీవనం పశుజీవనంగానే తలంచ బడుతుంది. శ్రీచాణక్యుడు ఇలా అన్నాడు.-

ఆహార నిద్రా భయమైథునాని
    సమాని చైతాని నృణాం పశూనామ్।
జ్ఞానం నరాణామధికో విశేషో
    జ్ఞానేన హీనాః పశుభిః సమానాః॥ (చాణక్యనీతి 17:17)

॥ శ్రీహరిః ॥

# విన్నపము

పరమ పూజ్యులు, నిత్యలీలాలీనులు, గీతాప్రెస్, కళ్యాణ్ పత్రికా సంస్థాపకులగు శ్రీ జయదయాళ్ జీ గోయందకా గారి ద్వారా రచింపబడి కళ్యాణ్ పత్రిక ద్వారా ప్రచురింపబడిన వివిధ వ్యాసములలో కొన్నింటిని అనువదింపజేసి తెలుగు పాఠకుల చేతికి దుర్లభమైన మానవజన్మను ఉత్తమంగా తీర్చిదిద్దుకొనుటకు సర్వోత్తమ సాధనగా ఈ పుస్తకమును అందించుటకు సంతసించుచున్నాము.

ఇందులో శారీరిక, మానసిక, బౌద్ధిక, వ్యావహారిక, సామాజిక, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మికాది అన్ని రకాల ఔన్నత్యమును సాధించుటకు సర్వజనోపయోగకరంగా వివేచింపబడినది. అంతియేగాక లోకకళ్యాణమునకై సంస్కృతం, ఆయుర్వేదం, భగవద్గీత, రామాయణములను విరివిగా ప్రచారం చేయాలని; అన్ని వర్ణాశ్రమములకు చెందిన మానవమాత్రులెల్లరు భగవంతుని చేరుకొనుటకు యోగ్యులేనని తెలుపుతూ, సత్యనిష్ఠ, శ్రద్ధా, ప్రేమ, నిష్కామ కర్మ ఇత్యాది అనేక అంశములను గూర్చి సులభ సాధనా రూపంలో సవిస్తరముగా చర్చింపబడినది.

జాతి, మత, లింగ, వయోభేదం లేకుండా అన్ని రంగాల వారికి ఉపాదేయముగా నుండెడు ఈ పుస్తకమును ఆంధ్ర పాఠకలోకము చదివి, చదివించి భగవత్కృపతో మానసిక, నైతిక, వ్యావహారిక, సామాజిక, ధార్మిక, ఆధ్యాత్మిక పురోగతిని సాధింపగలరని మా ఆశ ఆశంస.

వినీతులు
ప్రకాశకులు
గీతాప్రెస్ - గోరఖ్‌పూర్

ఆవశ్యకమైనదైనప్పటికీ ఆ పనిలో కూడా మన సమయాన్ని వెచ్చించకూడదు. అయితే మనం లేకపోయినా మన జీవిత కాలంలో ఇంకా మరణానంతరం కూడా ఇతరుల ద్వారా నెరవేర్చలేని పనిని, ఇహపరలోకాలలో కల్యాణదాయకమైన పనిని, తప్పకుండా చేయాలి. మనకు మానవ శరీరాన్ని ఇచ్చిన పనిని, ఇంకా ఈ పనిలో ఏమాత్రం లోపం జరిగినా మనం పునర్జన్మ ఎత్తాల్సిన పనిని తప్పక చేసి తీరాలి. అలాగే మనద్వారా తప్ప ఇతరుల ద్వారా నెరవేర్చలేని పనిని సర్వకాలాలలో సర్వప్రథమమైనదిగా, అత్యంత మహిమాన్వితమైనదిగా నెంచి, తగు తత్పరతతో అన్నింటికంటె ముందుగా చేయాలి. ఇంతకీ ఆ పనేమిటి? అంటే అదే పరమాత్మ ప్రాప్తి. ఆ పరమాత్మప్రాప్తికి ఉపాయమేమిటి? పరమేశ్వరుని యందు భక్తి, ఉత్తమ గుణాలను అలవరచుకోవడం, ఉత్తమ విధానాలను ఆచరించడం, సంసారం యెడల వైరాగ్యం, ఉపరతి, సజ్జన సాంగత్యం, ఉత్తమ శాస్త్రగ్రంథాల స్వాధ్యాయం, పరమాత్మ తత్త్వానికి సంబంధించిన యథార్థజ్ఞానం, మనస్సు, ఇంద్రియాల సంయమం, దుఃఖితులకు, అనాథలకు నిష్కామ సేవ ఇత్యాదులు కాబట్టి ఇలాంటి పనులలోనే మన సమయాన్ని అధికాధికంగా వెచ్చించటానికి ప్రయత్నించాలి.

ఎక్కువ సమయం ఈ మనస్సు వ్యర్థంగానే చింతన చేస్తూంటుంది. అదే మనకు ప్రమాదకరమైన విషయం. కాబట్టి మనస్సును వ్యర్థ చింతన నుండి తొలగించి భగవచ్చింతనలో లగ్నం చేయాలి. అలాగే జపతపాదుల సమయంలో ఆవరించే నిద్ర, సోమరితనం వంటి దుర్గుణాలను వివేకంతో, ఆలోచనతో, పట్టుదలతో తొలగించుకోవాలి. అలా చేయని పక్షంలో ముందుముందు ఘోరంగా పశ్చాత్తాప పడాల్సి వస్తుంది. శ్రీ తులసీ దాసుగారు ఇలా పేర్కొన్నారు.

**సో పరత్ర దుఖ పావయి సిర్ ధునిధుని పఛితాయి।**
**కాలహి కర్మహి ఈస్వరహి మిథ్యా దోస లగాయి॥**

అనగా – ఇహలోకమునందు పరమేశ్వర ప్రాప్తికై ఎంతమాత్రమూ ప్రయత్నింపక పరలోకమున కేగిన జీవుడు అచట దుఃఖమును పొంది, తలలను బాదుకుంటూ రోదించును. అంతేగాక, కాలమును, కర్మను, ఈశ్వరుని యందు మిథ్యాదోషములను ఆరోపించును.

– "ఆహారం, నిద్రా, భయం, మైథునం – ఇవి మానవుల్లో పశువుల్లో ఒకేరకంగా ఉంటాయి. మానవుల్లో అయితే జ్ఞానం అధికంగా ఉంటుంది. ఇదే మానవులలో గల విశేషం. అలాంటప్పుడు జ్ఞానం లేని మనుష్యులు పశువులతోనే సమానమవుతారు."

కాబట్టి మనమందరం మన కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. చేసుకోని పక్షంలో చివరకు మనమే ఘోర పశ్చాత్తాపాన్ని పొందాల్సి వస్తుంది. ఈ విషయంలో శ్రుతి మనల్ని హెచ్చరిస్తూ ఇలా పేర్కొంటోంది –

"ఇహ చేదవేదీదథ సత్యమస్తి
న చేది హావేదీన్మహతీ వినష్టిః।
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి" (కేనోపనిషత్తు: 2:5)

"ఈ మనుష్య శరీరంలోని పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకో గలిగితే అది సత్యమూ, ఉత్తమము అవుతుంది. అదే ఈ జన్మలో వాటిని తెలుసుకోని పక్షంలో అది గొప్ప నష్టమే అవుతుంది. ధీరపురుషులు సర్వభూతాలలో (జీవులలో) పరమాత్మనే చింతన చేసి – పరమాత్మను తెలుసుకొని ఈ దేహాన్ని విడిచిపెట్టి శాశ్వతత్వాన్ని (అమృతత్వాన్ని) పొందుతారు. అనగా ఈ దేహం నుండి ప్రాణాలు బయల్వెడల గానే వారు అమృతస్వరూపుడైన పరమాత్మను చేరుకొంటారు."–

కాబట్టి సమస్త జీవరాశులలో పరమాత్మ స్వరూపాన్ని చింతన చేస్తూనే తమ జీవితాన్ని సఫలం చేసుకోవడం బుద్ధిమంతులైన మనుష్యుల కర్తవ్యం. మానవ జన్మ బహు దుర్లభమైనది. అది పరమేశ్వర కృప వల్లనే మనకు లభించింది. అలాంటి సదవకాశాన్ని పొంది మహత్త్వపూర్ణమైన జీవితసమయంలో ఒక్కక్షణాన్ని కూడా మనం వ్యర్థంగా పోగొట్టుకో కూడదు. మనం ఏపని మీద వచ్చామో (పుట్టామో) దానిని అన్నింటికంటె ముందుగా నిర్వర్తించాలి. మన ప్రమేయం లేకుండా మన జీవిత సమయంలో ఇతరులు చేయగల పనిని వారితోనే చేయించాలి. ఆ పనిలో మన అమూల్య సమయాన్ని వెచ్చించకూడదు. అలాగే మన మరణానంతరం మన వారసులు (ఉత్తరాధికారులు) చేయగలిగిన పనిని అది ఎంతటి

అని పిలుస్తున్నాం. సమస్త భూమండలంలోని ప్రజలు భారతదేశం నుండే ధార్మికశిక్షణను (ధార్మిక విద్యను) పొందుతూండేవారు. ఇది ఒకప్పుడు అలా ఉండేది. 'మనుస్మృతి'లో ఇలా పేర్కొన బడింది.

**ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః।**
**స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః॥ (2:20)**

"ఈ దేశంలో (భారతదేశంలో) జన్మించిన బ్రాహ్మణుల వద్దనుండి అఖిల భూమండలంలోని సకల మానవులు తమతమ ఆచారాల యొక్క విద్యను గ్రహించాలి. కాబట్టి ఈ భారతదేశం ఆధ్యాత్మిక విషయాలలో అన్ని దేశాలకంటె ఉత్తమమైనదిగా పరిగణింపబడుతోంది. ఇంకా నేటికీ ఆధ్యాత్మిక విషయాలలో ఉత్తమమైనదే!"

ఈ కలియుగం, మహా అనర్థాలకు, పాపాలకు మూలమైనదే అయినా, ఇందులోని ఒక గొప్ప గుణమేమిటంటే ఈ యుగంలో కేవలం భగవద్భక్తితోనే మనుష్యులు ఉద్ధరింప బడెదరు – శ్రీ తులసీదాసు ఇలా పేర్కొన్నాడు.

**కలిజుగ్ సమజుగ్ ఆన నహి, జౌ నరకర బిస్వాస్।**
**గాయి రామ గునగాన్ బిమల, భవ తర బినహి ప్రయాస్॥**

'కలియుగముతో సమానమైన వేరొక యుగము లేనేలేదు. శ్రీరామ చంద్రుని నిర్మలమైన గుణములను విశ్వాసంతో గానము చేసిన నరుడు, తరించిపోవును. ఈ సంసార సాగరము నుండి సునాయాసముగా తరించిపోవును.'

ఆధ్యాత్మిక ధార్మిక గ్రంథాల సాంగత్యం కూడా ఈ కాలంలో ఇంచుమించు బహు సులభమైనదే! ఈ విధంగా సామగ్రినంతా పొంది కూడా మన 'అకర్మణ్యత' కారణంగా భగవంతుని పొందలేకుండా ఉంటున్నామంటే అది మనము సిగ్గు పడాల్సిన విషయమే కాకుండా బహు దుఃఖదాయకమైన విషయం కూడా! శ్రీ తులసీదాసు ఇలా పేర్కొన్నాడు –

**జో న తరై భవసాగర నర సమాజ అస పాయి।**
**సో కృతనిందక మందమతి ఆత్మహన గతిజాయి॥**

పరమేశ్వరునికి మన మీద మిక్కిలి అధికమైన, అకారణమైన దయ ఉంది. అందువల్ల ఆయన కృప వల్లనే ఈ మానవ శరీరం లభించింది. శ్రీరామచరిత మానస్‌లో ఇలా పేర్కొన బడింది-

**ఆకర చారి లచ్ఛ చౌరాసీ। జోని భ్రమత యహ జివ అబినాసీ॥**
**ఫిరత సదా మాయా కర ప్రేరా। కాలకర్మసుభావ గున ఘేరా॥**
**కబహుంక కరి కరునా నరదేహీ। దేత ఈస బిను హేతు సనేహీ॥**

ఎనుబది నాలుగు లక్షల 'గని'లో నాలుగు విధములైన జీవులు (స్వేదజ-అండజ-ఉద్భిజ-జరాయుజములను) ఉన్నవి. అవినాశి యగు జీవుడు వీనిలోనే తిరుగుతూ జన్మిస్తూ, మరణిస్తున్నాడు. ఏలయన, ఈ జీవుడు కాల, కర్మ, స్వభావ, గుణములతో ఆవృతుడై మాయకులోబడి నిరంతరం వివిధ యోనులలో తిరుగాడుచుండును. జీవుడు ఈ విధంగా దుఃఖితుడగుటను గాంచిన కరుణామూర్తియగు ఈశ్వరుడు నిర్హేతుకమైన దయను గురిపించి, తనను చేరవచ్చుటకై మానవదేహమును ప్రసాదించును. (కావున ఇట్టి దుర్లభమైన అవకాశమును జీవుడు సద్వినియోగ పరచుకొని పరమాత్మను చేరుకొనవలెను.)

ఈ విషయాన్ని మనం బాగా ఆలోచించాలి. ఈ భూమండలం మీద అసంఖ్యాకమైన జీవరాశులున్నాయి. వాటిలో మానవులు చాలా తక్కువ సంఖ్యలోనే ఉన్నారు - అంటే అత్యంత పరిమితంగానే ఉన్నారు. అలాంటి దుర్లభమైన మనుష్య శరీరాన్ని పొంది మానవులు సోమరి తనంతో, నిర్లక్ష్యంతో, పాపకార్యాల్లో, సుఖభోగాల్లో జీవనాన్ని గడుపుతున్నారంటే అది వారి మూర్ఖత్వం కాక మరేమగుతుంది?

భగవంతుని దయవల్ల మనకు ఉత్తమధర్మం, ఉత్తమకాలం, ఉత్తమ దేశం, ఉత్తమ జాతి, ఇంకా ఉత్తమ సాంగత్యం కూడా లభించాయి. ఎందుచేతనంటే మనం హిందూధర్మం పేరుతో పిలిచే వైదిక సనాతన ధర్మం అన్నింటికంటె ప్రాచీనమైనది అనగా అనాదియైనది. ఇంకా ఇతరమైన మతమతాంతర ధర్మాల పేరుతో ప్రసిద్ధమైనవన్నీ దీని తరువాతివే! దీని సహాయంతో తయారైనవే! అందువల్ల ఇది సర్వశ్రేష్ఠమైనది కూడా! మూడు లోకాలలో పృథ్వి శ్రేష్ఠమైనదయితే, ఈ పృథ్విలో ఆర్యావర్తం (భారతదేశం) మరింత శ్రేష్ఠమైనది. దీనినే మనం హిందూదేశం (హిందూస్థాన్)

ఈ నరజన్మను పొంది విషయసుఖములందే రమించువాడు, చేజిక్కిన అమృతమును త్రోసి రాజని విషమును స్వీకరించిన వాడగును. ఏలయన, పరశువేదిని పోగొట్టుకొని గురివింద గింజను పొందిన వానిని లోకములో ఎవరునూ మెచ్చుకొనలేరుకదా!'

"కాబట్టి (అర్జునా!) సుఖరహితమూ, క్షణభంగురమూ అయిన ఈ దుర్లభ మనుష్య శరీరాన్ని పొంది నిరంతరం నన్నే భజించుము."

మానవజన్మ ఎంత విలువైనదంటే దానికోసం ఎవడైనా ఒక లక్ష రూపాయలు వెచ్చించినా అతనికది ఒక్క క్షణమైనా లభించదు. కాబట్టి మన జీవితంలోని ప్రతిక్షణాన్నీ అమూల్యంగా భావించి వ్యర్థంగా గడచిపోకుండా చూసుకోవాలి. కాలం గడచిపోతూనే ఉంది. జ్ఞానులు జ్ఞానం ద్వారా, భక్తులు భక్తిద్వారా, యోగులు యోగం ద్వారా అలాగే వ్యాపారులు శ్రద్ధాపూర్వకమైన వ్యాపారం ద్వారా శీఘ్రంగా తమ ఆత్మకు సుఖ సౌభాగ్యాలు కలిగేలా (ఆత్మ ఉద్ధరింపబడేలా) నడుం బిగించి అన్ని విధాలా కృషి చెయ్యాలి.

ఆత్మ కల్యాణానికి, పరమాత్మ ప్రాప్తికి సంబంధించి అనేకమైన శాస్త్ర విహిత మార్గాలున్నాయి. వాస్తవానికి లక్ష్యాన్ని సరిగా ఉంచుకోవాల్సిన ముఖ్యమైన అవసరం ఉంది. లక్ష్యం మీద నిరంతరం గురితప్పని దృష్టి ఉన్నట్లయితే ఏదో ఒక రకమైన మార్గంలో పయనించి సాధకుడు తన లక్ష్యాన్ని చేరుకొని తన ధ్యేయాన్ని సాధించగలడు. లక్ష్యం యెడల గురితప్పని దృష్టి అతడిని మార్గభ్రష్టుడు కాకుండా సర్వదా రక్షిస్తూ ఉంటుంది. తులాధారుడు, నందభద్రుడు అనే పేరుగల వ్యాపారులు తమ వ్యాపారం ద్వారానే తమని తాము ఉద్ధరించుకొన్నారు. తులాధారుడి కథ పద్మపురాణంలోని సృష్టి ఖండంలో, మహాభారతంలోని శాంతి పర్వంలో ప్రస్తావించబడింది. అలాగే నందభద్రుడి కథ స్కందపురాణంలోని మాహేశ్వర ఖండాతర్గత కుమారీఖండంలో ప్రస్తావించబడింది. వీరికి సత్యవ్యాపారముండేది. అందరి యెడల సమదృష్టితో కూడిన వ్యవహారముండేది. నిష్కామభావం ఉండేది. ఇంకా వ్యాపారం ద్వారానే పరమాత్మ ప్రాప్తిని పొందడం వారి సాధనగా ఉండేది. నేడు కూడా ఎవరైనా ఇలాంటి వ్యాపారం చేసే పక్షంలో వారికి కూడా పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. ఎందుకంటే అలాంటి

'ఏ మనుజుడు ఇట్టి సదవకాశమును (అనగా సత్సాంగత్యము, సద్గ్రంథములను, సద్ బుద్ధిని) పొంది కూడా, సంసార సాగరము నుండి దాటిపోలేని వాడు కృతఘ్నుడు, మందమతి కాగలడు. తుదకు అతడు ఆత్మహత్య చేసుకొనువారలు పొందెడు గతిని పొందగలడు.'

కాబట్టి మనందరం సోమరితనం, నిద్ర, పాపం, అలక్ష్యం, ఆడంబరాలు, అభిరుచులు, విశ్రాంతి, విషయసుఖాలు, భోగవిలాసాలు, దుర్వ్యసన దురాచారాలు, పాపపంకిలాలు, కళంకాలు మొదలైన వాటిని విషతుల్యంగా భావించి వాటిని విడిచిపెట్టాలి. అలాగే భజనధ్యానాలూ, సత్సంగ స్వాధ్యాయాలు, సేవాసంయమాలు, సద్గుణసదాచారాలు, జ్ఞానవైరాగ్యాలు మొదలగు వాటిని అమృత సమానంగా భావించి శ్రద్ధాభక్తి పూర్వకంగా ఎల్లవేళలా అలవర్చుకొంటూ ఆ సేవలో నిమగ్నులు కావాలి. ఇంకా భగవన్నామ, రూప, గుణ, ప్రభావ, తత్త్వ రహస్యాలను తెలుసుకోవడం కోసం వాటికి సంబంధించిన శ్రవణ, పఠన, కీర్తన, స్మరణాదులు గావిస్తూ మనుష్యజీవనాన్ని సార్థకం చేసుకోవాలి!

మానవజీవితం మిక్కిలి ఉపయోగకరమైనదీ, దుర్లభమైనదీ, సర్వోత్తమమైనదీ అయినప్పటికీ ఇది క్షణికమైన దన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఇప్పుడున్నది మరుక్షణంలో ఉండదు. దీనిని నమ్మటానికి వీలులేదు. మృత్యువు ఎప్పుడు వచ్చి దీనిని కబళించి వేస్తుందో తెలియదు. మానవశరీరం కేవలం భోగభాగ్యాలు అనుభవించటానికి మాత్రమే కాదు — ఆహారం, నిద్రమైథునాది ధర్మాలు పశుశరీరంలో కూడా ఉన్నాయి. మరి అలాంటప్పుడు మనుష్యశరీరాన్ని పొంది ఆహారనిద్రామైథునాది ధర్మాలతో తమ సమయాన్ని గడిపేవాళ్ళు మనుష్యరూపంలో ఉన్న పశువులే అవుతారు. శ్రీతులసీదాసుగారు ఇలా అంటాడు —

**ఏహి తన కర ఫల బిషయ న భాయీ। స్వర్గవు స్వల్ప అంత దుఖదాయీ॥**
**నర తను పాయి బిషయ మన దేహీ। పలటి సుధా తే సఠ బిష లేహీ॥**
**తాహి కబహుఁ భల కహఇ న కోయీ। గుంజా గ్రహఇ పరసమని ఖోయీ॥**

'సోదరా! దుర్లభమైన మానవ దేహము ద్వారా విషయసుఖమును సంగ్రహించి, అనుభవించుటయే దీని ఫలమని తలంచరాదు. స్వర్గ సుఖముకూడా అల్పమైనది, తుదకు దుఃఖదాయకమైనది. దేవదుర్లభమగు

తమ వర్ణధర్మానుసారం, స్వాభావిక కర్మల ద్వారా పూజించి పురుషులు పరమసిద్ధిని పొందుతున్నారు."

కాని నేడు అన్ని విధాలయిన శాస్త్రవిపరీతభావాల గాలివాన వచ్చిప డింది. దీనివల్ల మానవులు జీవితానికి సంబంధించిన అసలైన లక్ష్యాలను మరచిపోయి, లక్ష్యభ్రష్టులై అన్యాయవంతులూ, అధర్మపరులూ అవటానికి సంసిద్ధులయ్యారు. దీని వల్ల సమాజమంతటా అనేక విధాలయిన నైతిక శారీరక దురాచారాల వ్యాప్తి జరుగుతోంది. చెడు పనులలో చెడ్డభావం తొలగి వాటిపై గౌరవబుద్ధి కలుగజొచ్చింది. వేటివల్లనయితే పారమార్థిక హాని – సాధనాపథంలో అత్యంత అవరోధం కలుగుతోందో – వేటి వల్లనయితే ప్రజల సంతాప దుఃఖాతిరేకాలు వృద్ధి పొందుతున్నాయో, వాటికి సంబంధించిన విషయాలను ఇక్కడ చర్చిద్దాం! వీటిలోని ఒక విషయం ఏమిటంటే –

## వ్యాపారంలో సత్యం, సమత్వం యొక్క లోపం

ధనార్జనకు సంబంధించిన ఎన్ని ఉపాయాలున్నాయో నేడు ఇంచుమించు అన్నీ దూషితమై పోయినాయి. ప్రాచీన కాలంలో ధనార్జనోపాయాలలో ఇంతటి అసత్యం, కపటం, దొంగతనం నమ్మకద్రోహం, మోసం ఉండేవి కావు. వ్యవహారంలో సాధారణంగా సత్యం, సమభావం ఉండేవి. సత్యం, సమవ్యవహారం యొక్క స్వరూపం క్లుప్తంగా ఇలా ఉంటుంది.

వ్యాపారం చేసేటప్పుడు వస్తువుల్ని కొనేటప్పుడు, అమ్మేటప్పుడు తూకం, కొలత, లెక్కలు మొదలైన వాటిలో తక్కువగా ఇవ్వడం లేదా ఎక్కువగా తీసుకోవడం, వస్తువుల్ని మార్చి లేదా ఒక వస్తువులో మరో వస్తువును కలిపి కల్తీ చేసి మంచి వస్తువులకు బదులు నకిలీ వస్తువుల్ని ఇవ్వడం, లేదా చెడ్డ వస్తువులకు బదులు మంచివి తీసుకోవడం లాభం, కమీషన్, దళారి, వడ్డీ, బాడుగ మొదలైన వాటిని బట్టి ధర నిర్ణయించి ఎక్కువ తీసుకోవడం లేదా తక్కువ ఇవ్వడం – ఈ విధంగా ఏ వ్యాపారంలో నైనా అబద్ధం, కపటం, దొంగతనం, దౌర్జన్యం లేదా ఇతరవిధమైన అన్యాయాన్ని ఉపయోగించి ఇతరుల హక్కును కాజేయడం – ఇలాంటి సర్వదోషాలు లేకుండా సత్యనిష్ఠంగా, న్యాయయుక్తంగా

నిష్కామపురుషులలో లోభానికి తావుండదు. వారు కర్తవ్య బుద్ధితోనో భగవత్ప్రీతి కోసమో వ్యాపారాన్ని నిర్వర్తిస్తారు. ఇదే భగవత్ప్రాప్తికి సహజంగా మూల హేతువు అవుతుంది. లోభ బుద్ధి గల మానవులు ధనలోభంతో వ్యాపారం చేసినట్లే స్వార్థత్యాగులు, సాత్త్వికపురుషులు లోకహితాన్ని దృష్టిలో ఉంచుకొని కర్తవ్యబుద్ధితోగాని, భగవత్ప్రీతికోసం గాని వ్యాపారం చేస్తారు. లోభియైన వానిలో ధనం ఎలా పుట్టుకొస్తుందా అన్నభావం ఉన్నట్లే నిష్కాములైన వారిలో మానవాళికి అధికాధికమైన హితం ఎలా సమకూరుతుందా? అన్న ఆలోచనగాని, భగవంతుని ప్రేమ లేదా భగవత్ప్రాప్తి ఎలా కలుగుతుందన్న ఆలోచనగాని ఉంటుంది. భగవంతుని యెడల ప్రేమ, భగవత్ప్రాప్తికి సంబంధించిన ఉద్దేశ్యం – అది కోరికే అయినప్పటికి అది నిష్కామమైనదే అవుతుంది. కోరిక, ఆసక్తి, స్పృహ, మమతాహంకారాలు త్యజింపబడి ఉండగలిగే వ్యాపారం లేదా శాస్త్ర విహితకర్మ నిష్కామమైనది, భగవత్ప్రాప్తిని లభింపజేసేదిగా అవుతుంది. 'గీత'లో భగవానుడు ఇలా అంటాడు –

కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మ ఫలహేతు ర్భూర్మా తే సంగోఽస్త్వ కర్మణి॥ (2/47)

"నీకు కర్మ చేయుట యందే అధికారముంది. దాని ఫలితాల యందు కాదు. కాబట్టి నీవు కర్మఫలములకు హేతువు కాకుము. అంటే మమతాహంకారాలు, వాసన ఆసక్త్యాదులకు కారణము కాకుము. అట్లే కర్మ చేయకుండుట యందును ఆసక్తుడవు కాబోకుము"–

"విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి॥" (2:71)

"ఏ పురుషుడు సమస్త కోరికలను త్యజించి, మమతాహంకారరహితుడై అన్ని స్పృహలు వదిలి చరించునో, అట్టి పురుషుడు శాంతిని పొందగలడు."

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ (18:46)

"ఏ పరమేశ్వరునిచే సకల ప్రాణుల ఉత్పత్తి జరిగిందో, ఎవరి వల్ల ఈ సమస్త జగత్తు వ్యాప్తమై యున్నదో, ఆ పరమేశ్వరుని తమ

చేయకుండా ఉంటాడు. కాని న్యాయసమ్మతంగా ప్రాప్తించిన సొమ్మును బాగా కూడబెట్టాలని కోరుకుంటాడో, అట్టి లోభము అనుచితమైనది గాకుండా రాజసమైనది అవుతుంది. తామసమైన లోభంవల్ల వ్యవహారంలో సత్యం, సమత్వం ఉండదు. అలాగే రాజసమైన లోభం వల్ల సమత్వం ఉండదు.

## వ్యాపారుల కర్తవ్యం

వ్యాపారంలో ఎల్లప్పుడు నిజాయితీగా వ్యవహరించడం, వ్యాపారస్థుల కవసరం. నిజాయితీగా చేయబడే వ్యాపారం వల్ల వ్యాపారాభివృద్ధి విశేషంగా జరుగుతుంది. ఎందుకంటే నిజాయితీవల్ల ప్రతిష్ఠబాగా పెరిగి అందరూ విశ్వసించడం మొదలెడతారు. ఒకసారి ప్రపంచంవైపు దృష్టి సారించి చూసినట్లయితే నేడు విశ్వవ్యాప్తంగా ఆంగ్లేయుల వ్యాపారం అందరికంటె మిన్నగా స్వచ్ఛమైనదిగా మన్ననలలందుకొంటోంది. అందువల్లనే వారు వ్యాపారంలో చాలా నేర్పరులుగా భావించబడుతున్నారు. నిజాయితీ కారణంగానే వారి వ్యాపారాభివృద్ధి బాగా జరిగింది. భారతదేశంలో ఆంగ్లేయుల పాలనలో కూడా ఇక్కడ ఆంగ్లేయుల వ్యాపారం విశేషంగానే ఉంది. ఎగుమతి దిగుమతులలో కొద్ది రోజుల ముందువరకూ జనపనార వంటి మిల్లులకు సంబంధించిన వ్యాపారం వారి చేతుల్లో ఉండేది. ఆ రోజుల్లో నిజాయితీ, వ్యాపార దక్షత, అడుగడుగునా కనిపించేది. వస్త్రాలు, నూలు, పత్తి మొదలైన వాటి వ్యాపారంలో ఆవాలు, అవిసెగింజలు, నువ్వులు, నూనెగింజలు ఇంకా గోధుమలు బియ్యం మొదలైన ధాన్యవ్యాపారంలో ధరలు పెరిగినా, తరిగినా కూడా ఆంగ్లేయవ్యాపారులు చాలా నష్టాలు సైతం సహించి ఎక్కువభాగం నమ్మకద్రోహానికి పాల్పడేవారు కారు. విదేశాల నుండి హెచ్చుగా వస్త్రం (బట్ట) వస్తూండేది. అయినా మార్కెట్టు గిరాకీ హెచ్చుగా ఉన్నప్పటికీ వారు నూలులో నకిలీ పత్తిని ఇచ్చేవారు కారు. అలాగే బట్టలో నూలు తక్కువ ఇచ్చేవారు కాదు సరికదా! కొలతలో కూడా తక్కువ చేసే వాళ్ళు కారు. బట్ట పొడయినా కొలతలో ఏమాత్రం తగ్గినా దాన్ని వెంటనే తగ్గించి (రిబేటుతో) తగ్గింపుధరలకు అమ్మేవారు. వారు అధికధరల మార్కెట్టులో చౌకగా అమ్మిన వస్తువులివ్వడాన్ని, చౌకధరల మార్కెట్టులో అధికధరకు తీసుకొన్న

మంచి (పవిత్ర) వస్తువుల్ని కొనడం, అమ్మడమే క్రయ విక్రయ రూపమైన సత్యవ్యవహారం అగుతుంది.

స్వచ్ఛమైన నెయ్యిలో డాల్డాను కలపడం, ఆవ, బాదం, కొబ్బరి మొదలైన నూనెల్లో "వైటాయిల్" కలపడం, పత్తి, పట్టు, ఉన్ని, వక్క మొదలైనవాటిలో, నీటిని చల్లి, వస్తుబరువును పెంచడం లేదా చూపించిన నమూనా (sample)కు బదులుగా నకిలీ వస్తువులివ్వడం, జీలకర్రలో రాళ్ళు, పప్పుల్లో మట్టిబెడ్డలు కలపడం, పిండిలో తక్కువరకం పిండిగాని, చింతపిక్కల పొడిగాని కలపడం, పాలలో నీళ్ళు కలపడం మొదలైన వన్నీ కూడా అసత్య వ్యవహారాలే! ఇవన్నీ లేకుండా ఉండేది పవిత్రమైన సత్యవ్యవహారం (మంచి వ్యాపారం) అనబడుతుంది.

అందరి యెడల పక్షపాతం లేకుండా సమదృష్టితో వ్యవహరించాలి. ఒక తెలివైన వ్యాపార కుశలుడైన వ్యక్తికి ఏ విధమైన భావంతో వస్తువు ఇచ్చామో లేదా అతని నుండి తీసుకొన్నామో అలాంటి భావంతోనే (ఆలోచనతోనే) కల్లాకపటంలేని, భోళామైన, వ్యాపార జ్ఞానం లేని వ్యక్తి దగ్గరనుండి కూడా ఇచ్చి పుచ్చుకోవడాలుండాలి. సారాంశమేమిటంటే - వస్తువులో, ధరలో పక్షపాతం, విషమదృష్టి ఇంకా ఏవిధమైన భేదభావం లేకుండా ఉండటమే సమవ్యవహారం.

నేటికాలంలో సాధారణంగా ధన లాలసత్వం (పేరాశ) యొక్క మోహంలో ప్రజలు కేవలం ధనార్జన కోసమే వ్యాపారం చేస్తున్నారు. అట్టి లోభిజనుల హృదయంలో క్రయవిక్రయ సమయాల్లో అధికాధికంగా ధనం ఎలా వస్తుందో అన్న భావమే ఉంటోంది. లోభం రెండురకాలుగా ఉంటుంది. అనుచితమైనది ఒకటి. ఉచితమైనది మరొకటి - అనుచితమైన లోభం తామసంగా, ఉచిత లోభం రాజసంగా ఉంటుంది. ఏ లోభానికి లోబడి మానవుడు అసత్యమాడి, కపటంగా ప్రవర్తించి, దొంగతనంతో, నమ్మకద్రోహంతో మోసం చేసి అన్యాయంగా ధనార్జన చేస్తూ న్యాయంగా లభించిన సత్కార్మల కోసం కూడా ఖర్చు పెట్టకుండా ఉంటాడో, ఆ లోభం అనుచితమైనది, తామసమైనది అవుతుంది. అలాగే ఏ లోభానికి లోబడి అసత్యం, కపటం, నమ్మకద్రోహం ద్వారా ధనార్జన చేయకుండా ఉంటాడో, న్యాయ సమ్మతమైన కార్యాలు ఎదురైనప్పుడు ఖర్చుచేయడంలో పిసినారితనం

కాలం, ధనం, ఆరోగ్యం, ధర్మం మొదలైన వాటిల్లో కూడా వీటి కారణంగానే బహువేగంగా పతనం సంభవిస్తోంది. వీటివల్ల యావత్సమాజానికి ఆధ్యాత్మిక, ధార్మిక, నైతిక, సాంఘిక పతనం సంభవిస్తోంది. చాలామంది ఇంటి ఆడవాళ్ళను, పిల్లాపాపలను సినిమాహాళ్ళకు తమవెంట తీసుకువెళుతూ గొప్పతప్పిదాన్ని చేస్తున్నారు. వీళ్ళంతా సినిమాల్లోని బీభత్సాన్ని, అశ్లీల చిత్రాలను చూడటం వల్ల అందరిబుద్ధి విచలితమై భ్రష్టు పట్టి పోతుందనే విషయాన్ని, దీని తాలూకు సంభవించబోయే దుష్పరిణామాన్ని గురించి ఇప్పటికి ఆలోచించటం లేదు. పిల్లలు తల్లిదండ్రుల సమక్షంలో, తల్లిదండ్రులు పిల్లల సమక్షంలో సిగ్గుపడాల్సి రావలసి వచ్చే అశ్లీల దృశ్యాలు కూడా అప్పుడప్పుడు కనిపిస్తుంటాయి. దీని పరిణామమెలా ఉంటుందంటే తల్లి దండ్రుల, పిల్లల యొక్క పరస్పర న్యాయోచితమైన సిగ్గు, బిడియాలు సైతం క్షీణించి పోతున్నాయి. ఆరోగ్యం మీదకూడా గణనీయమైన ప్రభావం పడుతుంది. ఇకపోతే ధనం, ధనంతోపాటు మానవ జన్మకు లభించిన అమూల్యమైన కాలం వృధాగా గడచిపోవడం ప్రత్యక్షమే కదా!

పోనీ, ధార్మికమైన సినిమా చూడటం వల్ల ఏదైనా లాభం ఉన్నదా? అంటే అలాంటిదేమీ ఉండదు. మొదటిది సినిమాల్లో ఆద్యంతమూ ప్రేక్షకుల చిత్తాన్ని ఆకర్షించి డబ్బు సంపాదించే ఉద్దేశమే సర్వసాధారణంగా అందరికీ ఉంటుంది. ఇందువల్ల దానిలో అసలైన ధార్మికత ఎక్కడా రాదు - ఇక రెండోది నటీనటులు ఎలాంటి వారైనా వారందరూ ఇంద్రియాలను జయించిన వాళ్ళుగా, ధార్మిక భావనతోనే సినిమాల్లోకి ప్రవేశించారని చెప్పలేం. యుక్తవయస్సు, రేయింబవళ్ళు శృంగారసంబంధ వాతావరణంలో ఉండటం, అలాగే అభినయించడం, ఆడంబరం విలాసాలలో విశృంఖలత్వం, రూపసౌందర్యాల ప్రకటన, ధనాధిక్యత మొదలైన వన్నీ మనుష్యులు కర్తవ్య భ్రష్టులై ప్రమాదంలో కూరుకు పోవడానికి కారణ భూతమవుతాయి. ఇలాంటి వాతావరణంలో ఉండే నటీ నటుల నుండి ప్రేక్షకులకు ధార్మిక భావన లభిస్తుందని ఆశించడం సర్వథా వ్యర్థమే అవుతుంది.

తల్లిదండ్రులు కొందరు ధనాశతో తమ యుక్త వయస్కులైన బాల బాలికలను సినిమాల్లో నటీనటులు కావడాన్ని ఒప్పుకొంటున్నారు. అది మిక్కిలి విచారించాల్సిన విషయం. ఎందుకంటే అది చాలా ప్రమాదకరమైనది

వస్తువులు తీసుకోవడాన్ని వారెపుడూ కాదనేవారు కారు - ఇంగ్లీషు మిల్లుల వాళ్ళు మార్కెట్టు చౌక అయినప్పుడు తీసుకొనే వాళ్ళకి నష్టం కలుగ గూడదనే విషయంలో శ్రద్ధ వహించే వాళ్ళు. ఎవరికైనా దళారీ, ఏజన్సీ, బెనియన్‌షిప్ వ్యవహారం అప్పగించినప్పుడు పేరాశతో కొద్దిపాటి దోషం కనిపిస్తే వారిని దళారి, ఏజన్సీ, బెనియన్‌షిప్ నుండి తప్పించి స్వార్థంతో ఇతరులకి ఇవ్వవలసి వచ్చే అవకాశాన్ని ఎప్పుడూ వెదికేవారు కారు. ఇలాంటి నిజాయితీ, సద్వ్యవహారం వల్ల ప్రజలపై ఆ ప్రభావం ఉండేది. ఈ కారణం వల్లనే ప్రజలు అధికధరలు చెల్లించి లేదా తక్కువ తీసికొని కూడా వారి వద్ద క్రయ విక్రయాలు జరపాలనుకొనేవారు. ఇప్పటికీ ఇదే విషయం కొనసాగుతోంది. ఆదాయం పన్ను విషయంలో కూడా వారి ఖాతా పుస్తకాలను, రిజిష్టర్లను ప్రభుత్వం విశ్వసిస్తూండేది. ఇప్పుడు కూడా వారి ఖాతా పుస్తకాలు రిజిష్టర్లు విషయంలో భారతీయ వ్యాపారుల వాటికంటె ప్రజలూ, ప్రభుత్వమూ కూడా మిక్కిలి విశ్వాసం చూపుతున్నారు. మన వాణిజ్య సోదరులు కూడా సత్యాన్ని పరహితాన్ని దృష్టిలో ఉంచుకొని వ్యాపారిక సుందర ఆదర్శాన్ని పాటించాలి. దీనిలోనే అన్ని విధాలయిన గౌరవం ఉంది. పరిపూర్ణమైన నిజాయితీ గల వ్యాపారంతోపాటు నిష్కామభావం కూడా ఉండే పక్షంలో అంతఃకరణము పరిశుద్ధమై ఆ వ్యాపారం ద్వారానే అత్యంత శీఘ్రంగా పరమాత్మప్రాప్తి కూడా లభింప కలుగుతుంది.

ఇదేవిధంగా ప్రభుత్వోద్యోగులు, ఇతర వృత్తులకు సంబంధించిన సోద రులందరూ అన్యాయం, అధర్మం, అసత్యం ద్వారా వచ్చే సొమ్మును రానీయకుండా, దోషరహితమైన వృత్తిని భగవత్స్వాజ్ఞా రూపమైన కర్మగా మలచుకొని నిష్కామ భావంతో చేస్తూ పరమాత్మను చేరుకోవడమనే పరమఫలాన్ని లాభంగా గడించి మానవ జీవితాన్ని సఫలం చేసుకోవడం పై దృష్టిని కేంద్రీకరించాలి.

## అశ్లీల సాహిత్యం - సినిమాలు

ఇటు శారీరక మానసిక పవిత్రతను నాశనం చేసే అశ్లీల సాహిత్యం, అటు వినోదం పేరుతో నడిచే అసభ్య చలన చిత్రాల వల్ల మన సదాచారాలకు మిక్కిలి ఘోరమైన క్షీణత సంభవిస్తోంది. సదాచారమే కాదు

పట్టుకొంటాయి. దీనివల్ల వారి జీవితం కూడా నష్టమైపోతుంది. ఇలాంటి హానికరమైన వినోద వృత్తి భవిష్యత్తులో వినాశనం కలిగిస్తుంది. దీన్ని వెంటనే అరికట్టే ప్రయత్నం చేయాలి. అలా కాని పక్షంలో వారి కుసంస్కారం ఇంకా పెరిగి మిక్కిలి దుష్పరిణామాలు సంభవిస్తాయి. కళా, వినోదాలపేరిట ఈ రకమైన ప్రజల పతనాన్ని ఏ ప్రభుత్వం గాని, సినిమాలు మొదలైన వాటిల్లో అభినయించే వారి మేలుకోరే తల్లిదండ్రులు మొదలైన వారు కాని, ప్రేక్షకులు గాని అంగీకరించ కూడదు. (ఇష్టపడరాదు). కాని ఇప్పుడన్నివైపులా మోహం కమ్ముకుంది. ఇది దేశ దౌర్భాగ్యం.

సినిమాల్లో అభినయించే బాలికల అంగసంచాలనం, కామోత్తేజక దృశ్యాలతో కూడిన చిత్రాలు, ప్రవర్తన చూచి వేలకొలది జనులు వారిపై పాపదృష్టిని ప్రసరింపజేస్తారు. ఈ విషయం గమనించి వారి తల్లి దండ్రులు సిగ్గుపడాలి. అవమానంగా గ్రహించాలి. ఈ ప్రవృత్తి ఇలాగే పెరుగుతూ పోతూంటే ముందుముందు సమాజం గతి (సమాజస్థితి) ఏమవుతుందో చెప్పలేం. వ్యసనాలలో చిక్కుకు పోయిన వాళ్ళ దుర్దశలాగా అశ్లీలమైన సినిమాల (దుర్వర్తన) లాలసులకు నైతిక, ధార్మిక, సామాజిక పతనమే సంభవిస్తుంది.

నేడు సినిమాలకు సంబంధించిన ప్రవృత్తి ఎంతదాకా ఎదిగిపోతోందంటే చాలామంది స్త్రీపురుషులు తమ కాపురం చెడగొట్టుకొని, తమ ధర్మాలను, కర్మాలను కోల్పోయి, తల్లిదండ్రులతో దెబ్బలాడి, శీలసంకోచాన్ని, సిగ్గువిడియాల్ని, మర్యాదల్ని సైతం నాశనం చేసికొని కూడా సినిమాలు చూస్తున్నారు. కార్మిక జనం కూడా వినోదం పేరుతో కఠినమైన శ్రమ కోర్చి సంపాదించిన సొమ్ముని సినిమాల కోసం నాశనం చేసుకొంటూ తమని పతనం చేసుకొంటున్నారు. ఇంకా చాలా మంది పిల్లలు దొంగతనం చేసి సినిమాలు చూస్తున్నారు. వినోదం పేరుతో సమాజంలో నలువైపులా వ్యాపించిన ఈ వ్యాధి చాలా భయానకమైనది.

ఇంగ్లీషు సినిమాల్లో అయితే పాత్రల అంగవిన్యాసంతోపాటు, నగ్న స్వరూపాన్ని కూడా చూపించటం మొదలుపెట్టారు. వీటిని చూశాక చిత్తవికారం పొంది పతనం కాని సంయమం గల పురుషులెవరుంటారు? వినోదం పేరుతో ఇలాంటి పాప భూయిష్ఠమైన సినిమాలను వృద్ధి

కూడా. దీని పరిణామం ఎలా ఉంటుందన్న విషయాన్ని వారు మరచిపోతున్నారు. ఇక్కడ అసలు విషయమేమంటే సినిమాల్లో నటిస్తూ వాటిద్వారా ధనాన్ని గడిస్తూ సన్మానాలందు కొంటూ గౌరవంగా భావిస్తుండే సినీరంగంలో (నటించే) యువతీ యువకులు తమని తాము విషయభోగ రూపమైన అగ్నిలో పడదోసుకొని స్వయంగా తమను నైతికంగా, ధార్మికంగా, పతనం చేసుకొంటున్నారు. సౌందర్యలోభంతో (మిడత/రెక్కలపురుగు) శలభం దీపశాఖను చూసి సుఖభోగ దృష్టితో దాన్ని సమీపించి విలవిల తన్నుకొంటూ కాలి భస్మమైనట్లే ఇక్కడి పరిస్థితి కూడా ఉంటుంది. ఆ పురుగుల మాట కొస్తే అవి భవిష్యత్తులో సంభవించే దుష్పరిణామాల్ని తెలుసుకోలేక కాలుడికి ఆహారమవుతున్నాయి. మరి మానవులయ్యుండీ భవిష్యత్పరిణామాల్ని ఆలోచించకుండా వినాశకరమైన, క్షణభంగురమైన సాంసారిక సుఖభోగాల కోసం అలాంటి కార్యక్రమాల్లో నిమగ్నులవుతుంటే వాళ్ళకి ఏం చెప్పాలి? భగవంతుడు వివేకాన్ని, బుద్ధిని ఇచ్చినప్పుడు మనుష్యులమై యుండి కూడా ఆ వివేకాన్ని, బుద్ధిని ఉపయోగించుకోని పక్షంలో మనకది మిక్కిలి సిగ్గు పడాల్సిన విషయం. అంతేకాదు దుఃఖించాల్సిన విషయం, విచారించాల్సిన విషయం కూడా!

రేయింబవళ్ళు మనిషి ఉండే వాతావరణాన్ని బట్టి, అతడు చేసే పనిని బట్టే అతని మనస్సు రూపుదిద్దుకొంటుంది. ఇంకా అతని మనస్సులో కూడా అదే వాతావరణం అలుముకొని ఉండి పదేపదే ఆ దృశ్యాలే ప్రత్యక్షమవుతూంటాయి. ఇది నిశ్చిత సిద్ధాంతం, అనుభవంలోని విషయం కూడా. దీని ప్రకారం అశ్లీల చిత్రాల్లోని నటీనటుల, వారి ప్రేక్షకుల మనస్సుల్లో కూడా అలాంటి ప్రపంచమే ఏర్పడుతుంది. దానినిబట్టే వారికి సహజంగానే నైతికంగా, ధార్మికంగా, సామాజికంగా పతనం సంభవిస్తుంది. నేడు సందుసందున గోడల కతికించి ఉన్న శృంగార సినిమా చిత్రాలు (పోస్టర్లు) దిన, వార, మాస పత్రికల్లోని సచిత్రప్రకటనలు, అలాగే పెద్ద పెద్ద నగరాల్లో పెళ్ళి ఊరేగింపులా మహోత్సవంగా బాజా భజంత్రీలతో తిరుగుతూ చేసే సినిమా ప్రకటనలు వీటన్నింటినీ చూస్తూ వింటూండే స్త్రీ పురుషులపై, బాలబాలికలపై బహు చెడ్డ ప్రభావం పడుతుంది. వారి మనసుల్లో అణగారి ఉన్న దురాలోచనలు జాగృతమవుతాయి; కొత్త కొత్త దురాలోచనలు, చెడు సంస్కారం పుట్టుకొచ్చి అక్కడే గూడు

గమనించి కూడా ఇప్పటికీ మనం కళ్ళు తెరవకుండా ఉండే పక్షంలో మరెప్పుడు తెరుస్తాం? ఎలా తెరుస్తాం? మనుష్యుల బుద్ధి భ్రష్టమవుతూ వారు మంచిని చెడుగా, చెడునుమంచిగా చూడటం మొదలుపెట్టినప్పుడు వారి సంస్కరణ చాలా కష్టమవుతుంది. ఎందుకంటే మనిషి చెడ్డను చెడ్డగా భావించినప్పుడే వాని సంస్కరణ సాధ్యమవుతుంది. కాని చెడ్డను మంచిగా భావించి కూర్చున్నవాడిని బాగుచేయడం కఠినమవుతుంది. కాబట్టి ఇహ పరసుఖసౌభాగ్యాలు వాంఛించే సోదరసోదరీ మణులకు మావిన్నపమేమిటంటే వారు స్వయంగా అటువంటి నాటకాలు, సినిమాలు చూడరాదనీ, అలాగే తమ బాలబాలికలకు కూడా చూపించరాదని – సినిమాలు, నాటకాలకు సంబంధించిన చెడుగుణాలను తెలిసికొని స్వయంగానే వాటిని విడిచిపెట్టినప్పుడు బాలబాలికలను కూడా అలాంటి వాటిని చూడకుండా ఆపగలుగుతాము. పిల్లలు అనుకరణ ప్రియులైనప్పటికీ, పిల్లలకు చెడు విషయాలపై ప్రభావం పడినంత త్వరగా మంచి వాటిమీద పడదు. ఎన్ని చెడ్డగుణాలయినా అవి మొదట్లో క్షణిక సుఖాన్నిచ్చేవి కావడం వల్ల అమృతతుల్యంగానే భాసిస్తాయి. అయితే వాటి పరిణామం మాత్రం విషతుల్యంగా ఉంటుంది. అలాగే మంచి విషయాలకొస్తే సాధనకాలంలో కఠినంగా ఉండటం వల్ల విషతుల్యంగా కనబడతాయేగాని పరిణామంలో (క్రమేణా) అవి అమృత తుల్యంగా ఉంటాయి. కాబట్టే ప్రస్తుతానికి సుఖదాయకంగా ప్రసిద్ధికెక్కిన వాటిని ప్రజలు అజ్ఞానంతో స్వీకరిస్తున్నారు. రోగియైన వాడు అపథ్యం యొక్క పరిణామాన్ని తెలుసుకోకుండా అపథ్యం చేసినట్లే విషయాసక్తులైనవారు కూడా జరగబోయే పరిణామాల్ని ఊహించకుండా వినాశకరమైన ప్రవృత్తులలో పడిపోయి తమ జీవితాల్ని పతనం అనే గోతిలో పడేసుకొంటున్నారు. అయితే వాళ్ళు పరిణామంలో దుఃఖాన్ని పొందినప్పుడు మాత్రం ఘోరంగా పశ్చాత్తాప పడకతప్పదు. కాని అప్పుడు ఆ పశ్చాత్తాపం వల్ల ఏ కార్యక్రమమూ సిద్ధించదు.

కాబట్టి అలాంటి సినిమాలు, నాటకాలు చూడరాదు; ఇతరులెవ్వరికీ చూపించరాదు; అలాగే వాటి యెడల అభిరుచిని కూడా పెంపొందించు కోకూడదు. సకల స్త్రీ పురుషులకు సవినయంగా మళ్ళీ, మళ్ళీ మేము చేసే విన్నపము ఇదియే.

పొందనివ్వటం, మన యువలోకం దయనీయంగా సినిమా బారిన బడి వేటాడే మృగంలా బలై తమజీవితం నుండి చేతులు ముడుచుకొని (చేతులు కడుక్కొని) కూర్చోవడం, మనదేశ భవిష్యత్తు అంధకారమయమై పోవడం వాంఛనీయమా?

కాబట్టి మా అభ్యర్థన ఏమిటంటే ఈ విషయాలపై ప్రభుత్వం దృష్టిని సారించి సెన్సారు బోర్డును మిక్కిలి కాఠిన్యంతో వ్యవహరించేలా చేసి ఈ చెడు ప్రవాహాన్ని, వరదని - బలమైన ఆనకట్ట గట్టి అడ్డగించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అలా చేయడం వల్ల ప్రజలు సామాజిక, నైతిక, ఆర్థిక సంబంధమైన హాని నుండి రక్షింపబడెదరు.

నేడు మనలో కొంతమంది రచయితలు కూడా హాని రచనలు చదివాక చదువరులు (పాఠకులు) తమ మనస్సుల్లో చాంచల్యాన్ని పొందకుండా ఉండలేని సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. అలాంటి వికారం వల్ల శక్తి, బుద్ధి, జ్ఞాపకశక్తి (స్మృతి), జ్ఞానం, చురుకుదనం, ఆయువు నశించడం, నానా విధాలయిన అనారోగ్యాలకు (రోగాలకు) బలికావడం అనివార్యమవుతుంది.

సినిమాల ప్రభావం మన వర్తమాన జీవన సరళిపై బహుచెడ్డగా పడుతోంది. ప్రజలు తమ వస్త్రాలు, దుస్తులు విషయంలో కూడా సినిమా బొమ్మలనే తయారు చేయడం మొదలెట్టారు. పైగా సంసారులైన స్త్రీలు ధరించటానికి సిగ్గుపడే వస్త్రాలను, దుస్తులను మనయువతులు, బాలికలు ధరించటం ప్రారంభించారు. ఇది ఎంతటి దిగజారిన స్థితో చూడండి!

ఇంతేకాదు మనసమాజంలో ఇప్పుడు నాస్తికత కూడా ప్రబలంగా ప్రచారం చేయబడుతోంది. దీని ఫలితంగా కొంతమంది ధర్మాన్ని, కర్మల్ని, భగవంతుణ్ణి, జ్ఞానాన్ని, వైరాగ్యాన్ని, హిందూసంస్కృతిని, సదాచార సద్గుణాల్ని ఏవగింపు దృష్టితో చూడటం మొదలెట్టారు. పైగా వాటి గురించి ఆలోచించకుండా, అర్థం చేసుకోకుండానే ప్రాచీన కాలం నుండి సాగి వచ్చిన ఆదర్శ మర్యాదలను ఆడంబరంగా, డంబాచారాలుగా పేర్కొనటం మొదలుపెట్టారు. ఈ స్థితి ఇలాగే ఏర్పడిన పక్షంలో భవిష్యత్తులో విశృంఖలత్వం, ధర్మాన్ని వ్యతిరేకించే వాతావరణం, అరాజకత్వం ముందు ముందు ఇతోధికంగా ప్రబలి పోతాయి. అందువల్ల మనం జాగ్రత్తపడి ఇలా వృద్ధి పొందే ఈ పోకడను అరికట్టాలి. ఈ విధమైన కీడును

అత్తవారి అధీనంలోనో, పుట్టింటివాళ్ళ అధికారంలోనో ఉండటమే దీనికి కారణం. వీటిల్లో మరికొన్ని సందర్భాల్లో అయితే అత్తవారి వైపు వాళ్ళే బలవంతంగా వితంతువు ఆస్తిపై అధికారాన్ని చేజిక్కించుకొంటున్నారు. మరికొందరైతే ఎంతటి దుష్టులై ఉంటారంటే వారికి ఎంత ధనం ఉన్నప్పటికి వారు అన్నవస్త్రాలకు లేక అలమటిస్తున్నా, వేదనతో విలపించినా, వారు వితంతుస్త్రీలకు ఏ కొంచెం కూడా ఇవ్వరు సరిగదా!– నీకు కేవలం తినడానికి సరిపడిన నెలసరి బత్తెం పొందే అధికారమే తప్ప ధన సంపత్తి మీద ఎట్టి అధికారమూ లేదని" పలుకుతారు. ఇలాంటి శుష్కవచనాలు చెబుతారే తప్ప ఆ మాటకొస్తే తినడానికి నెలసరి ఖర్చులు కూడా ఇవ్వరు. పాపం! అసహాయురాలైన ఆస్త్రీ రోదిస్తూ తన దుఃఖమయజీవనాన్ని బహుకష్టంతో గడుపుతోంది. లోకానికి జడిసి వారిపై దావా (వ్యాజ్యం) కూడా వేయలేదు. ఒకవేళ దావా వేసినా ఆమెకు ఎవరూ సాయంకూడా చేయరు. ఇలాంటి స్త్రీల కోసం ఏవిధమైన రుసుమూ తీసుకోకుండానే ఉత్సాహంగా వారికి సహకరించే లాయర్లు కూడా ఉండరు. మాయా మర్మం తెలియని స్త్రీలైతే వాళ్ళు ఏమీ తెలుసుకొనలేరు. పుట్టింటివారి, మెట్టినింటివారి వంశ ప్రతిష్ఠ వల్ల స్వయంగా కోర్టుకెక్కి తమ హక్కు కోసం దావా వేయడానికి పేరు నమోదు చేసుకోరు. పోనీ ఎక్కడైనా అలా చేసినా సంగతి చెప్పాల్సి వస్తే అలాంటి సందర్భాల్లో వారి ఆస్తిని దుర్వినియోగం చేసే వాళ్ళు, వాళ్ళని మరింత కలతపరుస్తారు. రెండోమనిషి ఎవరూ సహాయమే చేయరు. ఎవరైనా చేద్దామనుకొన్నా వాళ్ళూ అతడినే తిట్టి పోస్తారు. ఇలాంటి వ్యవహారాలు ఈ రోజుల్లో పేరు ప్రతిష్ఠలున్న వాళ్ళల్లో కూడా జరుగుతూనే ఉన్నాయి. అయితే దీని భావం అందరూ అలానే ఉంటారని కాదు. భగవంతుణ్ణే, ధర్మాన్ని గౌరవించే సత్పురుషులు చాలామంది ఉన్నారు. అత్తవారింటినుంచి ధనసంపత్తిని రాబట్టుకొని తమ వద్ద ఉంచుకోవాలని కొంతమంది పుట్టింటివాళ్ళు ప్రయత్నిస్తుంటారు. తల్లిదండ్రుల్ని పోగొట్టుకొన్న ఆమెవద్దనుండే ధనసంపత్తిని కాజేసే సోదరులు, బంధువులు రక్షకులై కూడా ఉంటారు. పాపం! ఆ విధవరాలు వేదనతో రోదిస్తూ ఉండిపోతుంది. సిగ్గుతో, భయంతో చచ్చిపడుతున్న ఆమె ఏమీ చెప్పలేదు సరిగదా! లోలోపల వేదనతో, మౌనంగా రోదిస్తొంటుంది. అలాంటి స్త్రీల గాథలెన్నో స్వయంగా నేను విన్నాను, కన్నాను కూడా!

## వితంతువుల ధనంపై దురాశ

చెడు వచ్చినప్పుడు అది నాలుగు దిక్కులనుండి వచ్చిపడుతూంటుంది. ఇతర పాపాలతోపాటు సమాజంలో మరోపాపం కూడా పెచ్చు పెరిగి పోతోంది. అది సామాజిక నైతిక దృష్టిలో మహాహానికరమైంది. అంతేకాదు అది పారమార్థిక పథానికి కూడా మిక్కిలి ప్రతిబంధకమైంది. అదేమిటంటే - వితంతువులైన సోదరీమణుల యెడల కుటుంబ సభ్యుల దుష్ప్రవర్తనం. నేడు వాస్తవానికి వితంతువులైన తల్లుల, సోదరీమణుల స్థితి మిక్కిలి దయనీయంగా ఉంది. మర్యాదస్థులు, పరువు ప్రతిష్ఠలు కలవారు, సౌశీల్యవంతులు అయిన వితంతు సోదరీమణుల యొక్క ఈ దుఃఖభరితమైన దుర్దశను చూసి హృదయంలో ఏ కొద్దిపాటి దయ ఉన్నవారి హృదయమైనా ఆర్ద్రమవుతుంది. చాలా మంది వితంతువుల గాథలను విని, వారి దుస్స్థితిని స్వయంగా గమనించి ఇక్కడ ప్రస్తుతం వాటిని ప్రత్యక్షీకరించడం జరుగుతోంది. పేదరికంలో గడిపేవాళ్ళ ఇళ్ళల్లోని మాటేమిటి? ధనవంతులనబడే వాళ్ళు, తమని పరువుమర్యాదలు ఉన్న వాళ్ళుగా భావించుకొనేవాళ్ళు అయిన అధికశాతం సోదరులు కూడా వితంతు సోదరీమణుల యెడల ప్రవర్తించే తీరు నీచస్థాయిలోనే ఉంటోంది. వితంతువులపై జరుగుతున్న అత్యాచారాలను వింటుంటే ముఖ్యంగా హృదయం ఉన్న ప్రాణులకు వేదన కలుగుతుంది. అలాగే వారి దుఃఖాన్ని చూస్తుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఇక్కడ నేను కుల శీలాది విషయాలపై గౌరవ దృష్టితో ఎవరిపేర్లూ ఉటంకించకుండానే వితంతువులపై జరుగుతున్న అత్యాచారాలకు సంబంధించిన విషయాలను ప్రస్తావిస్తున్నాను.

వితంతు స్త్రీలయొక్క నగనట్రా, భర్త మరణించినప్పుడు అత్తవారు, పుట్టింటివాళ్ళు శరీరనిర్వహణార్థం సహాయపూర్వకంగా ఇచ్చినధనం, అత్తవారి దగ్గరనుండి, పుట్టింటివారి వద్దనుండి పెళ్ళి సమయంలో, కాపురానికి వచ్చేసమయంలో లభించిన సొమ్ము, నగలు, వస్త్రాలు, ఇంకా భర్త జీవించి ఉన్నప్పటి జీవితభీమా ద్వారా అతని తదనంతరం వారసత్వంగా ఇచ్చేధనం, ఇవేగాక వితంతుస్త్రీకి సంబంధించిన స్వంత ఆస్తి; ఇదంతా కలిసి స్త్రీ ధనమనబడుతుంది. ఇలాంటి ధనమంతా ఉన్నప్పటికీ వితంతుస్త్రీలు అన్న వస్త్రాలకోసం దుఃఖితలై కనిపిస్తున్నారు. వితంతువుల ఈ ఆస్తి అంతా వారి

పైన పేర్కొన్న ఈ ముగ్గురు స్త్రీల దీన పరిస్థితిని నేను స్వయంగా నా కళ్ళతో చూశాను. వందలాదిగా, వేలకొలదిగా ఇలాంటి దుర్దశాగ్రస్త వితంతు సోదరీ మణులున్నారు. స్థలాభావం వల్ల మరిన్ని ఉదాహరణలివ్వడం లేదు. ఇలాంటి స్థితిలో ఆ వితంతు సోదరీల జీవితనిర్వహణ ఎలా జరుగుతుందో ఆలోచించండి. అలాంటి వారిని న్యాయస్థానానికి వెళ్ళమని కూడా సలహాయివ్వ లేకపోతున్నారు. ఎందుకంటే కోర్టులకు వెళ్ళడం వల్ల ధనం, ధర్మం, పరువు ప్రతిష్ఠలు నాశనమవుతాయి. పైగా అమాయకులు కావడం వల్ల వాళ్ళు కోర్టుకు వెళ్ళలేరు. ఒకవేళ వెళ్ళినా వారికి సహాయాన్ని ఎవరందిస్తారు? ఇలాంటి వాళ్ళ దయనీయస్థితిని చూసి జాలితో కన్నీరొలికించని సహృదయుడెవడుంటాడు?

పేరు ప్రతిష్ఠలున్న వంశంలోని పేదస్త్రీలు మరింత దుఃఖితులైయున్నారు. వారికి ఇతరులనుండి సహాయం తీసుకోవడానికి కూడా సిగ్గు కలుగుతుంది. అయితే లేమివల్ల తీసుకోవల్సిన బాధ్యత ఏర్పడుతోంది. అలాంటి వితంతు మాతలకు నెలసరి సహాయం అందించే సోదరులు అభినందనీయులు. సోదరులందరికీ "మీ ఎరుకలో ఎవరైనా దుఃఖితులైన వితంతు మాతలు, సోదరీమణులు ఉంటే వారికి యథాశక్తిగా కర్తవ్యంగా భావించి శారీరకంగా, మానసికంగా, ధనరూపంగా, త్రికరణ శుద్ధిగా సహాయం చెయ్యండి!" అని నేను విన్నవించుచున్నాను. ॐ

## వరకట్నం వల్ల జరిగే కీడు

ఈ రోజుల్లో కన్యల వివాహసమస్య కూడా జటిలమవుతోంది. ఎందుకంటే మనదేశంలో వరకట్నం భయంకరమైన రూపాన్ని ధరించింది. మగపిల్లల తల్లిదండ్రులు (సంరక్షకులు) కన్యాదాతల నుండి అధికాధికంగా ధన సంపత్తి తీసుకోవాలని అభిలషిస్తున్నారు. కన్య వైపు వాళ్ళు అక్కడక్కడ అప్పులు, సహాయాలు తీసికొని కూడా పెళ్ళిళ్ళు చేయాల్సి వస్తోంది. అలా కాకపోతే ఆ కన్యకు వివాహమవటం కష్టమై పోతోంది. కొందరు ఆడపిలలు తమ తలిదండ్రుల పేదరికాని చూసి వాళ్ళ

దుఃఖం వల్ల దుఃఖితులై ఆత్మహత్య కూడా చేసుకుంటున్నారు. మరో ఆడపిల్ల తాలూకు పేద తల్లిదండ్రులు వివాహానికి కావలసిన ధనం లేని కారణంగా ఆ ఆడపిల్ల రోగగ్రస్తురాలై మరణిస్తేనే బావుంటుంది అని కూడా తలపోస్తున్నారు. ఒకవేళ ఆ పిల్ల రోగగ్రస్తురాలైతే ఆమెకు తగిన వైద్యచికిత్సలు చేయించడం లేదు. వీటన్నింటికి మూలకారణం వరకట్న దురాచారమే!

పైన పేర్కొన్న ఈ హత్యలన్నింటి పాపం అనుచితంగా వరకట్నం తీసుకొనే వాళ్ళకే చుట్టుకొంటుంది. బొత్తిగా కట్నం తీసుకోని వాడు తన జీవితాన్ని సఫలం చేసుకొంటూనే ఉన్నాడు. కట్నం యిచ్చే తల్లిదండ్రులు ఇవ్వదలుచుకొన్న దానికంటే తక్కువ తీసుకొనేవాడు కూడా అభినందనీయుడే! తాము తిరస్కరించినప్పటికి కట్నం ఇచ్చేవాళ్ళు సంతోషంగా ఆసక్తితో ఇచ్చే దానిని (అయితే ఇవ్వడంలో వాళ్ళు ఋణగ్రస్తులు కావడం గాని లేదా ఇల్లు, పొలం లాంటివి అమ్మవలసి రావడం గాని జరిగిందా? అన్నది అవశ్యం తెలుసుకోవాలి) తీసికొని సంతుష్టులయ్యేవాళ్ళని కూడా మనం ఈ పాపంలో భాగస్వాములుగా భావించము కాని వివాహం కోసం బేరసారాలు చేసేవాళ్ళ అధికాధికంగా గుంజాలనుకొనేవాళ్ళు, ఎక్కువ కట్నం ఇచ్చే అమ్మాయినే వివాహం చేసుకొనేవాళ్ళు ఇంకా ఆడపిల్లవైపు వాళ్ళు తమ స్తోమతను బట్టి మగపెళ్ళివారికిచ్చి సంతోషపెట్టాలను కొన్నప్పుడు కూడా సంతుష్టులు కానివాళ్ళు - ఇలాంటి వారందరు పైన పేర్కొన్న పాపంలో భాగస్వాములవుతారు.

కాబట్టి సోదరులందరితో మా ప్రార్థన ఏమిటంటే ప్రస్తుతం వరకట్న దురాచారం పెచ్చుపెరిగిపోతోంది. పెరిగిపోతున్న ఈ వరదను ఏదోరకంగా యథాశక్తి ఆపే ప్రయత్నం చెయ్యండి! అలా చేయని పక్షంలో సమాజం కట్నం తీసుకొనే వాళ్ళనుద్దేశించి 'కట్నం తీసుకోవడాన్ని యథాశక్తిగా త్యజించండి! ఎంతగా త్యాగం చేస్తే అంతగా వారు అభినందన పాత్రులవుతారు. కట్నాల ఆడంబరం కూడా వరకట్న దురాచారం కొనసాగటానికి ఇంకా వృద్ధి

పొందటానికి కారణమగుతుంది. దానిని కూడా వెంటనే రూపుమాపాలి!' అని మేము ప్రార్థించు చున్నాము.

మానవ జీవితం యొక్క ఉద్దేశ్యం భగవత్ప్రాప్తి అనే విషయాన్ని బాగా ఆలోచించాలి. ఈ భగవత్ప్రాప్తి సాధనలో పరస్పరం సహాయం చేసుకోవడం అందరి ధర్మం. అలా చెయ్యకుండా ఒకరి హృదయంలో గొప్ప చింతను రగిలించేవాళ్ళు నిజానికి మహా అనర్థాన్ని తెచ్చి పెడుతున్నారు. బలవంతంగా కట్నం తీసుకొనే వాళ్ళు కన్యాదాత హృదయంలో చింతను రేపి పరమార్థం నుండి కూడా తప్పిస్తున్నారు. కాబట్టి వరకట్న దురాచారం అరికట్టబడాలి!

## సాధనావశ్యకత

ఇంతవరకు సంగ్రహరూపంలో గొప్పగొప్ప పాపరూపంలో ఉన్న విఘ్నాలను గూర్చి చర్చించ బడింది. ఇంకా మరిన్ని దోషాలు కూడా వచ్చి పడ్డాయి. అభక్ష్య భక్షణం, మద్యపానం, నడవడి భ్రష్టుపట్టి పోవడం, గురుజనులను అవమానించడం, సదాచార దారిద్ర్యం, హింస-ప్రతిహింసావృత్తి, అసంతృప్తి, క్రమశిక్షణా రాహిత్యం, మతాతత్త్వం, ఈర్ష్య, ద్రోహబుద్ధి వంటి బహుదోషాలు మహా వేగంగా సమాజంలో పెచ్చుపెరిగి పోతున్నాయి. భగవంతుని యెడల, ధర్మం యెడల నమ్మకం తొలగి పోతున్నది. వ్యక్తిగత స్వేచ్ఛపేర మనస్సుకి, ఇంద్రియాలకు దాసులవడం మితిమీరి పోతోంది. ఇంద్రియనిగ్రహం తగ్గిపోతోంది. ఇవన్నీ దేశనైతిక పతనానికి, సంపూర్ణమైన దుర్దశకు సాక్ష్యాలు. ఇంకా అవి లౌకిక, పారలౌకిక, పారమార్థిక హానికి పోషకాలు. వీటన్నింటి నుండి బయటపడటం, సమాజాన్ని రక్షించడం, అందరి పరమకర్తవ్యం. ఈ ఉద్దేశ్యం తోనే స్వల్ప ప్రయత్నరూపంగా గోరఖ్‌పూర్‌లో "సాధకసంఘ్" అనే పేరుతో ఒక సంస్థ ఏర్పాటు చేయబడింది. దీనిలో చేరటానికి పదహారు నియమాలు వదిలిపెట్టడానికి, పన్నెండు స్వీకరించటానికి (పాటించడానికి) ఏర్పాటు చేయబడ్డాయి. ఆ నియమాలు ఈ క్రింద పేర్కొనబడినవి. ఈ నియమాల్లో అన్నింటిని గాని, కొన్నింటిని గాని పాటించదలుచుకొనేవారు

ఈ సంఘ సభ్యులు కావచ్చు. సభ్యులనుండి ఏ విధమైన రుసుమూ వసూలు చేయబడదు. నియమ పాలనమే అందుకు చెల్లించ వలసిన రుసుము (ఫీజు). ఆ నియమములు ఈ విధంగా నున్నవి –

# సాధన నియమావళి

## త్యజించవలసిన నియమాలు

1. అపకార త్యాగం –ఎవ్వరికి అపకారం (కీడు) చేయరాదు.
2. అసత్య త్యాగం –తెలిసి అబద్ధమాడరాదు.
3. పరసత్త్వాపహరణ త్యాగం –ఇతరుల హక్కులను హరించరాదు.
4. పరస్త్రీ–పరపురుష స్పర్శత్యాగం –పురుషుడు పరస్త్రీని స్పృశించకుండా ఉండటం, అలాగే స్త్రీ పరాయి పురుషుణ్ణి స్పృశించకుండా ఉండటం, అనే విషయాలను పాటించాలి. తల్లి, నాయనమ్మ, అమ్మమ్మ మొదలైన పెద్దలు, వృద్ధులు అయిన స్త్రీలు, తండ్రి, అన్నగారు, పుత్రుడు మొదలగు పురుషుల స్పర్శ ఈ నియమానికి ప్రత్యేకంగా అడ్డంకి కాదు. అనారోగ్యస్థితిలో వైద్యుడు, డాక్టరు, పరిచారికలు (నర్సులు) స్పృశించవచ్చును.

5. క్రోధత్యాగం —మనస్సులో కూడా క్రోధం రాకుండా ఉన్నట్లయితే అది ఉత్తమోత్తమం. ఒకవేళ మనస్సులో కలిగినా దానిక్రియ బయటకు రాకూడదు. క్రోధం కలిగినప్పుడు అసత్యమయిన, కఠోరమైన దుర్భాషలాడరాదు. ఇంకా అలాంటి చేష్టలు (దెబ్బలాటలు) కూడా చేయరాదు.

6. పరచర్చా త్యాగం —ఎవ్వరిమీద చాడీలు చెప్పటం లేదా నిందించటం చేయరాదు.

7. అసత్యసాక్ష్యాల త్యాగం —తప్పుడు సాక్ష్యాలు చెప్పరాదు.

8. అశ్లీల వినోద త్యాగం —అశ్లీల (అసభ్య) హాస్యమాడరాదు.

9. చర్మసేవన త్యాగం —చర్మాన్ని వాడుకలోకి బొత్తిగా తీసుకు రారాదు. (మోటరు, రైలు, రిక్షావంటి వాటికి ఈ నియమం వర్తించదు)

10. మాదకద్రవ్యాల త్యాగం: —పొగాకు, బీడీ, భంగు, గుట్కా, గంజాయి గంజాయి నుండి తయారుచేసిన మత్తు పదార్థాలను డ్రగ్స్‌ను సేవించరాదు. (రోగుల విషయంలో నిషేధం లేదు)

11. కాలాన్ని వృథా చేసే ప్రవృత్తి త్యాగం —పేకాట, పాచికల వంటి ఆటలు ఆడరాదు. వ్యర్థమైన మాటలు మాటాడరాదు.

12. వేశ్యానాట్య త్యాగం —వేశ్యల నాట్యాలు చూడరాదు.

13. సదాచార నాశకమైన చిత్రాల (చిత్రపటాల) త్యాగం —సినిమాలు బొత్తిగా చూడరాదు.

14. ద్యూత త్యాగం —ఎట్టి పరిస్థితుల లోనూ జూదమాడరాదు.

15. అభక్ష్యభక్షణం —మద్యపాన త్యాగం - (క) మాంసభక్షణం, మద్యపానం ఎంతమాత్రమూ పనికిరాదు. (ఖ) ఉల్లి, వెల్లుల్లి వంటివి తినరాదు. ఔషధంగా సేవించాల్సి వచ్చినప్పుడు తరువాత తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

16. హింసాయుక్తంగా తయారు చేసిన పాదరక్షల త్యాగం —చంపిన పశువుల చర్మాలతో చేసిన చెప్పులు, బెల్టులు, బ్యాగులు మొదలగునవి వాడకూడదు.

## ఆచరించవలసిన నియమాలు

1. సర్వత్రా భగవద్బుద్ధి —సాధ్యమైనంత వరకూ ఎవరితోనైనా వ్యవహరించేటప్పుడు భగవద్బుద్ధితో వ్యవహరించాలి.

2. భగవత్స్మరణ —ప్రతి పదిహేను నిమిషాలకు ఒకసారి భగవంతుని నామ, రూప, లీలా, గుణ, విశేషాలను స్మరించాలి. స్మరణకు వచ్చినప్పుడు మరచిపోకుండా ఉండే ప్రయత్నం చేయాలి.

3. సూర్యోదయాత్పూర్వమే మేలుకోవడం —సూర్యోదయానికి ముందే నిద్రనుండి మేల్కొనాలి.

4. ప్రాతస్స్మరణం–వందనం —ఉదయం లేస్తూనే భగవంతుని స్మరించాలి. పృధ్వీమాతకు కూడా వందనాలర్పించాలి.
"పాదస్పర్శ క్షమస్వమే"
"భూమిదేవి! నమోఽస్తుతే" అని

5. గురుజనులకు అభివాదాలు –ఇంటిలోని తల్లి, తండ్రి, గురువు, తాత, నాయనమ్మ, అమ్మమ్మ, పెదతండ్రి, పెద్దమ్మ, అత్తగారు, మామగారు, బావ గారు, వదినగారు లేదా తోడికోడలు మొదలగు పెద్దలకు, వృద్ధులకు ప్రతి రోజూ నమస్కరించాలి. పదవిలో పెద్దవారైనప్పటికి వయస్సులో తక్కువ వారైన స్త్రీల చరణాలు పురుషులు స్పృశించరాదు. స్త్రీలు, తమ భర్త, తండ్రి మొదలైన వారిని తప్పించి అన్యపురుషు లందరికీ దూరంగా ఉండే అభివాదం చేయాలి.

6. సంధ్యా–గాయత్రీ అర్చన –యజ్ఞోపవీతం ధరించిన ద్విజులు ప్రాతః, సాయం, సంధ్యాసమయాలలో సంధ్యా వందనం చేయాలి. ఆ రెండు వేళల్లో కనీసం (108 సార్లు) ఒక మాల గాయత్రీ జపం చేయాలి. లేని పక్షంలో తమతమ ధర్మానుసారం ఆ రెండు సమయాల్లో ఉపాసన చేయాలి.

7. గీతాధ్యయనం –ప్రతిరోజూ శ్రీమద్భగద్గీతలో ఒక అధ్యాయం పారాయణం చెయ్యాలి. (వీలు న్నచో అర్థసహితంగా)

| | |
|---|---|
| 8. సత్సంగం–స్వాధ్యాయం | –ప్రతిరోజూ ఓ అరగంట సత్సాంగత్యం (సత్సంగం) చేయాలి. సత్సంగం లేనప్పుడు (గీత, రామాయణం, భాగవతం, భక్తచరిత్ర సత్పురుషుల వాణి లేదా తమతమ మతగ్రంథాలు మొదలైన సద్గ్రంథాల) స్వాధ్యాయం (అధ్యయనం) చేయాలి. |
| 9. భగవన్నామ జపం | –ప్రతిరోజూ భగవంతునికి సంబంధించిన, తమకు ఇష్టమైన నామాన్ని సుమారు ఓ వెయ్యి సార్లు జపించాలి. |
| 10. కర్తవ్య పాలన | –ఇంటిలో, ఇంటిబయట తమ బాధ్యతలను ఆరోగ్యంగా ఉన్నంతవరకూ అలక్ష్యం చేయరాదు. ఎల్లప్పుడూ ఉత్సాహంతో, ప్రేమతో కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. |
| 11. పవిత్ర వస్త్రధారణ | –సాధ్యమైనంత వరకూ చేనేతతో తయారైన స్వదేశీ (ఖద్దర్) వస్త్రాలు ధరించాలి. |
| 12. నియమపాలన | –పరిశీలన – ఈ నియమాలలో వేటిని పాటించడం జరిగిందో, వేటివలన జరగలేదో లేదా ఏవి అసంపూర్ణంగా జరిగాయో ఎన్ని దోషాలు జరిగాయి? ఎందుకు జరిగాయి? అన్న విషయాలను ప్రతిరోజూ సుమారు పదిహేను నిమిషాల పాటు నిద్రించుటకు ముందు సమీక్షించుకోవాలి. అలాగే ఆ దోషాలకు ప్రాయశ్చిత్తరూపమైన శిక్షా విధానం అమలుచేయాలి. మళ్ళీ ఆ తప్పు జరగకుండా చూడాలి. ఈ విషయాన్ని దృఢంగా నిశ్చయించుకోవాలి. |

[ప్రతి పొరపాటుకు (తప్పిదానికి) ఒక పూట ఉపవాసం ఉండటం గాని, లేదా భగవన్నామమేదైనా సరే ఒక వేయిసార్లు జపం చేయడం గాని – లేదా "హరేరామ" వంటి 16 నామాల మంత్రమును ఒక మాల జపంగాని – ప్రాయశ్చిత్త రూపంగా చేసుకోవాలి.]

☆ విజ్ఞప్తి ☆

ఈ నియమాలన్నీ అందరికీ ఉపయోగకరమైనవి – వీటిని శ్రద్ధగా పాటించిన పక్షంలో పైన పేర్కొన్న దోషాలన్నింటిని పరిహరించుకోవచ్చు. మానవ జీవితాన్ని సఫలం చేసుకోవడానికి సరళ (తేలిక) మార్గం లభిస్తుంది. కాబట్టి ఈ నియమాలను స్వయంగా విశ్వాసపూర్వకంగా పాటించాలి. అలాగే ఆప్త మిత్రులతో కూడా పాటింపచేయాలి. నియమావళిని, ఇంకా సభ్యులయ్యాక నియమాలు పూరించటానికి గల డైరీని వ్యవస్థాపక్ **"సాధక సంఘ్," గీతా ప్రెస్, గోరఖ్‌పూర్** అనే చిరునామాకు హిందీ లేదా ఇంగ్లీష్ భాషలో ఉత్తరము వ్రాసి తెప్పించుకోవచ్చును.

**హరిః ఓం తత్సత్**

* * *

# 2. సత్యం, శ్రద్ధ, ప్రేమ, నిష్కామభావం

తమమేలు కోరే పురుషుల కోసం సర్వశ్రేష్ఠమైన కొన్ని విషయాలను గూర్చి నివేదింప బడుతుంది.

## సత్యము

వీటిలో మొదటి విషయం – సత్యము. సత్యం సాక్షాత్తు పరమాత్మ యొక్క స్వరూపం. "పరమాత్ముడున్నాడు"– ఈవిషయం నిశ్చయమైనప్పుడు పరమాత్మప్రాప్తి సహజమే అవుతుంది. ఎందుకంటే పరమాత్ముడున్నాడు. వాస్తవంగా ఉన్నాడు. పరమాత్ముని ఉనికి వల్లనే అందరికి ఉనికి ఉన్నది. భగవంతుడు – సత్తు, అసత్తుల నిర్ణయం చేస్తూ 'భగవద్గీత'లో ఇలా పేర్కొన్నాడు –

నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వ దర్శిభిః॥ (2:16)

"అసత్ వస్తువుకు ఉనికి అంటూ ఉండదు. సత్తునుదానికి ఉనికి లేకుండుట అనేది ఉండదు. ఈ విధంగా ఈ రెండింటి తత్త్వం తత్త్వజ్ఞానులైన పురుషుల ద్వారా దర్శించబడేంది."

భావమేమిటంటే సత్ వస్తువులకు ఎప్పుడు నాశము ఉండదు. అలాగే అసత్ (అస్తిత్వములేని మిథ్యా) వస్తువులకు ఎప్పుడూ ఉనికి ఉండదు. అలాంటి సత్ వస్తువు ఏదయితే ఉంటుందో అదే పరమాత్మ. పరమాత్మ ఉనికి వల్లనే అందరి ఉనికి ఉన్నది. అందువల్ల మనందరం ఎల్లప్పుడూ సత్యాన్ని ఆచరించాలి. (సేవించాలి). సత్యసేవనంలో సత్యభాషణం

కూడా ఉన్నది. సత్యభాషణం వల్ల కూడా పరమాత్మ ప్రాప్తి కలుగగలదు. ఎందుచేతనంటే పరమాత్మ స్వరూపం (సత్) సత్యము. అయితే సత్యాన్ని పలికేవాళ్ళు ఈ విషయాలపై ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉంటుంది. సత్యభాషణం అని దేనిని అంటారనేది ముందుగా అవగతం చేసుకోవాలి. విన్న విషయం ఎలా వినిపించబడిందో, ఎలా చూడబడిందో, ఇంకా ఎలా అర్థం చేసుకోబడిందో, అంతకంటె ఎక్కువగా చెప్పకుండా ఉండటం, తక్కువగా చెప్పకుండా ఉండటం - ఎలా విన్నది, ఎలా అవగతం చేసుకొన్నది అలాగే తెలియజేయాలనే అభిప్రాయంతో చెప్పడమే "సత్యము". రెండో విషయమేమిటంటే - సత్యం విషయంలో "చతురత" ఉండకూడదు. కపటం ఉండకూడదు. గ్రహించిన భావాన్ని నిష్కపటంగా ఉన్నదున్నట్లుగా తెలియపరచాలి. సత్యమైయుండీ ప్రియమైనదే వాస్తవానికి సత్యమైంది.* ఒక సత్యాన్ని పలకటం వల్ల ఇతరు లెవరికైనా బాధకలిగే పక్షంలో (హింస) అది సత్యమైనదే అయినప్పటికీ అది సత్యం కాదు. సత్యాన్ని పలికే పురుషులు మితంగా మాట్లాడాలి. సత్యాన్ని పలికే పురుషులు ఎప్పుడు కూడా భవిష్యత్తుకు సంబంధించిన వాణిని పలుకరాదు. నిజానికి "నేను ఇది చెయ్యాలి; అది చెయ్యాలి"- అన్న భవిష్యత్సంకల్పాన్ని కూడా చేయరాదు. వాక్కు కూడా సత్యమైయుండాలి. సంకల్పం కూడా సత్యమై యుండాలి. క్రియ కూడా సత్యమైయుండాలి. భావం కూడా యథార్థమై యుండాలి. అప్పుడే సత్యము నందు వాస్తవికమైన నిష్ఠ కలుగుతుంది.

"భగవంతుడు సత్యము; ఆయన అంతటా ఉన్నాడు" అని మాత్రమే

---

* సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియమ్।
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మో విధీయతే॥ (స్కంద. బ్రా.ధ.మ. 6/88)

"సత్యం పలకాలి; ప్రియంగా పలకాలి. కాని అప్రియమైన సత్యాన్ని పలకకండి. అలాగే ప్రియమైన దైనప్పటికి అసత్యమైనదైతే పలుకకండి - ధర్మాన్ని గూర్చి ఈ విధంగా నిర్ణయింపబడినది."

మనిషికి తెలుసు. భగవంతుడు ఎలా ఉంటాడు అనే జ్ఞానం ఉండదు. "భగవంతుడున్నాడు" అన్న విషయమే తెలుస్తుంది. అయితే ఇంతటినిశ్చయ జ్ఞానం వల్ల అతని ద్వారా ఎలాంటి పాపకార్యమూ జరగదు. ఎందుకంటే "భగవంతుడున్నాడు. ఆయన "సత్". (సత్తు) ఆయన అంతటా ఉన్నాడు. నేను ఏది పలికినా భగవంతుడు వింటున్నాడు. నేను చేసే ప్రతిపనిని భగవంతుడు అంతా చూస్తూనే ఉన్నాడు." - అన్న విషయాలు అతనికి తెలుసు. అలాంటి స్థితిలో ఆతడు భగవంతునికి విరుద్ధంగా ఎలా పలుకుతాడు? వ్యతిరేకమైన ఏ పనైనా ఎలా చేస్తాడు? భగవంతునికి విరుద్ధంగా చరించేవాడు లేదా పలికేవాడు వాస్తవానికి భగవంతుణ్ణి నమ్మనే నమ్మడు. నేను భగవంతుణ్ణి నమ్ముతున్నాను - అని అసత్యమాడతాడు. నిజానికి ఆతడు నాస్తికుడు. భగవంతుడు నిత్యుడు, సత్యమైనవాడు, సర్వవ్యాపి అని నమ్మకం కలిగిన వాడిలో నిశ్చయత్వం కలుగుతుంది. భగవంతుడు అన్నిచోట్లా ఉన్నప్పుడు భయం దేనికి? ఈ నిశ్చయం వల్లనే అతనిలో ధీరత్వం, వీరత్వం, గాంభీర్యం స్వతస్సిద్ధంగానే వచ్చి చేరతాయి. ఈ నిశ్చయం కారణంగానే ముందు ముందు ఆతనికి భగవత్ప్రాప్తి కలుగుతుంది. "భగవంతుడున్నాడు" అని నిశ్చయమైన తర్వాత "భగవంతుడెట్లా ఉంటాడు?" - అనే విషయాన్ని భగవంతుడే అతనికి తెలియజేస్తాడు? ఈ విధంగా సత్యాన్ని ఉపాసించడం వల్ల పరమాత్మప్రాప్తి కలుగుతుంది. అయితే సత్యస్వరూపుడైన భగవంతుణ్ణి ఉపాసించే వాళ్ళెప్పుడూ అసత్యమాడరాదు. ఆతని వ్యవహారం కూడా సత్యంగానే ఉండాలి. ఇంకా ఆతని హృదయగత భావాలు కూడా సత్యంగానే ఉండాలి. ఎవని చేష్టల్లో, ప్రవర్తనలో, మోసం, కపటం, నమ్మకద్రోహం, దొంగతనం మొదలైన ఎటువంటి దురాలోచనలు ఉండవో, ఎవని మాటల్లో, ఆచరణలో విశుద్ధ నియతి ఉంటుందో, ఎవడు పరాయి స్త్రీలను, పరుల ధనాన్ని తుచ్ఛవస్తువుగా, త్యజింప దగినవిగా భావిస్తాడో, అతని వ్యవహారం ఆలోచన యొక్క సత్యసంధత ఆతనిని గూర్చి తెలియజేస్తుంది. అలా ఉండేవారి వ్యవహారం, భావం శుద్ధమైనవి. హృదయంలో ఉండే అలాంటి పరిశుద్ధమైన భావాన్నే 'సద్భావం' అంటారు.

దీనినే 'సద్గుణం' అనికూడా పిలుస్తారు. – మానసికమైన తపస్సుకు ఇది ప్రధానమైన అంగం.

శ్రీమద్భగవద్గీతలో ఇలా చెప్పబడింది –

**మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।**
**భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే॥** (17/16)

"మనః ప్రసాదః"– అనగా మనస్సుయొక్క ప్రసన్నత, "సౌమ్యత్వం" అనగా మనస్సుయొక్క సౌమ్యభావము (శాంతభావము). చంద్రుని స్వరూపం సౌమ్యంగా ఉన్నట్లే హృదయ స్వరూపం కూడా సౌమ్యమైనట్లయితే దానిని "సౌమ్యభావం" అంటారు. 'మౌనమ్' – మనస్సు ద్వారా నిత్యం భగవత్స్వరూపాన్ని మననం చేయడం – 'ఆత్మ–వినిగ్రహః' అనగా – మనోనిగ్రహము, మనస్సును తన స్వాధీనములో నుంచుకొనుట; 'భావసంశుద్ధిః'– అనగా ఆలోచనలయందు విశుద్ధత, అంతఃకరణంలోని ఆలోచనల్లో మిక్కిలి పవిత్రత – ఈ ఐదింటిని "మానసిక తపస్సు" అంటారు. ఈ విధంగా మనస్సులోని ఆలోచన సత్యమైనదే కావాలి. అలాగే కర్మాచరణ కూడా సత్యమైనదై ఉండాలి. ఉత్తమ ఆచరణలనే 'సదాచారాలు' అంటారు. సత్పురుషులు ఆచరించేవాటిని కూడా "సదాచారాలు" అని అంటారు. కాబట్టి మనుష్యుల ఆచరణలో హృదయగత భావాలలో ఇంకా వారి మాటలలో కూడా సత్యనిష్ఠ (సత్యత్వం) గోచరించాలి. ఈ విధంగా మనోవాక్కాయకర్మలు పవిత్రమైనప్పుడు వారికి పరమాత్మయొక్క యథార్థజ్ఞానం కలుగుతుంది. ఈ సత్యాన్నే సంక్షిప్తంగా వర్ణించడం జరిగింది.

## శ్రద్ధ

ఇప్పుడు మనం శ్రద్ధకు సంబంధించిన విషయాలను విచారిద్దాం! భగవంతునియందు, మహాత్ములయందు, శ్రీమద్భగవద్గీతాది శాస్త్రవచనాల యందు ప్రత్యక్షంగా కంటే కూడా విశేషమైన విశ్వాసం ఉన్నట్లయితే, ఆ విశ్వాసాన్ని 'పరమశ్రద్ధ' అంటారు. మన ఎరుకలోకి వచ్చిన విషయాలనే

మనం నమ్ముతాం. అయితే మనకు తెలియని విషయాలు కొన్ని ఉంటాయి. అలాంటి విషయాలకు సంబంధించి పైన చెప్పిన వచనాలలో ప్రత్యక్షంగా కంటే కూడా విశేషశ్రద్ధ కలిగి ఉన్నట్లయితే దానిని 'పరమ శ్రద్ధ' అంటారు. సర్వసాధారణంగా భగవంతుడు (చూద్దామంటే) చూడటానికి కనబడడు. అయితే "నిశ్చయంగానే భగవంతుడున్నాడు" - అని శాస్త్ర (వచన)ములయందు, మహాత్ముల యందు విశ్వాసముంచి అలాంటి దృఢనిశ్చయంతో అవగతం చేసుకోవాలి. - ఇది పరమశ్రద్ధ యొక్క ఒక స్వరూపం. సత్యవాదియైన ఒక మహాత్ముడు ఏదైనా ఒక ఇంటిని చూపి, "ఇది బంగారంతో చేసింది". అని చెప్పాడనుకొందాం. శ్రద్ధాళువైన పురుషునికి ఆ క్షణంలో ఆ ఇల్లు బంగారంతో చేసినట్లుగానే కనబడితే - ఇది పరమశ్రద్ధ. శ్రద్ధకు సంబంధించిన ఈ భావం పరమాద్భుతమైనది. ఎందుచేతనంటే ఆ ఇల్లు అతని ఎరుకలో, పర్యవేక్షణలో సున్నం, మట్టి, రాళ్ళు ఇటుకలతో కట్టబడింది. అయినప్పటికి "ఇది బంగారంతో కట్టబడింది" అని సత్పురుషుని ముఖతః పలుకబడటంతో తత్క్షణం అది స్వర్ణమయంగానే కనబడసాగింది. ఇలా కనబడటమే "సర్వోత్తమ శ్రద్ధ"

దీనికంటే నిమ్నశ్రేణికి చెందిన శ్రద్ధలో ఇల్లు, సున్నంతో చేసినట్లుగానే కనబడుతుంది. కాని అతని విశ్వాసంలో అది బంగారంతో చేసిందిగానే అయింది. అనగా బాహ్యంగా అది సున్నంతో కట్టబడినదిగా కనిపిస్తోందని అతనికి తెలిసినప్పటికీ, అది ఆంతరికదృష్టితో నిస్సందేహంగా స్వర్ణమయమైనదిగానే మారుతుంది. ఈ విధంగా ఇల్లు సున్నంతో కట్టబడినట్లు కనబడుతున్నప్పటికీ, అతడు (శ్రద్ధాళువు) దానిని బంగారంతో కట్టబడిన దానిగానే భావిస్తాడు. ఇంతకంటే ఇంకా నిమ్నశ్రేణి శ్రద్ధ విషయంలో - ఒకవేళ మహాత్ములైన వారు "ఈ ఇల్లు స్వర్ణమయంగా మారుతుంది" అన్నట్లయితే అది స్వర్ణమయంగానే మారిపోయి ఉంటుంది. అయితే వారి ముఖతః పై మాటలు వెలువడినప్పుడు ఆ ఇల్లు సున్నంతోనే కట్టబడిఉంది. కాబట్టి ఇప్పుడు కూడా అది సున్నంతో చేసిందే! అవును! ఒకవేళ

మహాత్ములైన వారు "ఇది స్వర్ణమయంగా మారుతుంది." అన్నట్లయితే అది స్వర్ణమయంగా మారగలదు - నిశ్శంకగా ఆ విశ్వాసం ఉండాలి. ఇది తృతీయ శ్రేణికి చెందిన శ్రద్ధ. దీని కంటే కూడా నిమ్నశ్రేణికి చెందిన నాలుగవ తరగతి శ్రద్ధ ఒకటుంది. అదేమిటంటే - ఏది సంభవమైనదో అది మహాత్ములు పలకటం వల్లనే అవశ్యం అది అయి తీరుతుంది తప్ప వారు అసంభవమైనది పలికినా అది అయి తీరదు. ఉదాహరణకి ఒక మహాత్ముడు "సూర్యుడు శీతలంగా అయిపోతాడు" అన్నాడనుకొందాం! ఆయన అలా పలకడం వల్ల సూర్యుడు శీతలంగా మారలేడు. కాని అది తప్పక సంభవించే విషయం అయితే అది జరిగి తీరుతుంది. ఇంకా చెప్పాలంటే ఒకరికి పిల్లో పిల్లాడో పుట్టే సమయం అనుకోండి. ఒక మహాత్ముడు "ఇది జరుగుతుంది" - అని చెబితే ఆ విషయం తప్పక జరుగుతుంది. కాని ఆయన వారికి "(శిల) రాయిపుడుతుంది" అని చెప్పాడనుకోండి. అది అసంభవం కదా! కాబట్టి ఆ విధంగా సాధ్యం కాదు (జరగదు.)

అయితే శ్రద్ధాళువులైన పురుషులకు అన్నీ సంభవమే! ఎలాగంటే - యాదవబాలకులు సాంబుణ్ణి గర్భవతిగా అలంకరించి అతడిని మునుల దగ్గరకు కొనిపోయి వాళ్ళని పరీక్షించాలని "దీనికి ఏ పిల్ల పుడుతుంది?" - అని అడిగారు. అప్పుడు మునులు వీడికి "ముసలం" (రోకలి) పుడుతుందని పలికారు. అప్పుడు నిజంగానే సాంబుడి నుండి ముసలమే పుట్టింది. మునులు యాదవ బాలకుల కపటాన్ని తెలుసుకొన్నారు. తెలుసుకొని వారితో "అసంభవమైన" పలుకులే పలికారు. కాని అదే సత్యమయింది. దానితోపాటే "ఈ ముసలంతోనే మీ వంశం నాశనమవుతుంది." - అని కూడా పలకడంతో వారి వంశనాశనం కూడా అట్లే సంభవించింది.

కాబట్టి వాస్తవానికి పరమశ్రద్ధాళువైన పురుషునికే, మహాత్ముల వచనాలపై అచంచల విశ్వాసమున్నవానికి - మహాత్ములు ఒకవేళ అసంభవమైన విషయాన్ని పలికినా అది సంభవమే అవుతుందని, అలాగే వారు పలకడం

వల్ల సంభవమైనది కూడా అసంభవం కాగలదనే నిశ్చయమే ఉంటుంది. ఈ విధంగా ఉచ్చకోటికి చెందిన పురుషుల సంకల్పం కూడా అలాగే ఉంటుంది. ఉచ్చకోటికి చెందిన పురుషులు భవిష్యద్వాణిని నిశ్చితరూపంలో పలకరు. అలాగే భవిష్యత్సంకల్పాన్ని కూడా చేయరు. జరిగేదేదైనా వారిలో విస్తారంగా ఉంటుంది. ఒకక్షణం తర్వాత ఏమి జరుగనున్నదో, ఏం జరుగుతుందో అనేది తెలుసుకోవాలని కూడా వారు వాంఛించరు. తెలుసుకోవాలన్న ఆవశ్యకత ఉందని కూడా భావించరు. ఇంకా వారు ఈ విషయాన్ని తెలుసుకోవడం ఉత్తమమైనదని కూడా తలపరు. అట్టి పురుషులే సత్యసంకల్పులవుతారు. వృథా సంకల్పాలు చేస్తూ ఉండేవాళ్ళ సంకల్పాలు సత్సంకల్పాలు కానేరవు. తమ మేలును కాంక్షించేవారు భవిష్యత్తుకు సంబంధించిన సంకల్పాలేవీ చేయరాదు. ఇది సంకల్పానికి సంబంధించిన రహస్య విషయం. భావి సంకల్పం భావి జన్మకు కారణభూతమవుతుంది. "నేను రేపు కలకత్తా వెళతాను" అని తమ మనస్సులో సంకల్పం కలిగిందనుకోండి. ఏదేని కారణంగా ఈ రోజున మీకు మృత్యువు సంభవించిన పక్షంలో ఆ సంకల్పం కారణంగా మళ్ళీ మరో జన్మయెత్తి కలకత్తా వెళ్లాల్సివస్తుంది. కాబట్టి కల్యాణకాములైన పురుషులు నేనేమీ చేయనక్కరలేదని గ్రహించాలి. జరిగేదాన్ని చూస్తూ ఉండాలి. ఒక క్షణం తర్వాత నేను ఈ పని చెయ్యాలి అని కూడా సంకల్పించరాదు. అలాంటి సంకల్పమే చేయకపోతే పనులెలా అవుతాయి? భోజనం చెయ్యాలి; క్రిందినుండి పైకి వెళ్ళాలి; పైనుండి కిందికి దిగాలి. వీటన్నిటి కోసం ముందుగా మనస్సులో సంకల్పం జరుగుతుంది. అప్పుడే తదనుసారంగా క్రియ జరుగుతుంది కదా! అని అన్నామనుకోండి. ఈ విధంగా అనడం సరియైనదే! కాని ఈ విషయంలో వికల్ప సహితంగానే సంకల్పం చేయాల్సి ఉంటుంది. వికల్ప సహితంగా అన్న దానిలో అంతరార్థమేమిటంటే - పైకి వెళ్ళాల్సిన అవసరం ఉన్నప్పుడు అది సరియైనదే! (అదిసరే!) కాని పైకి వెళ్ళటం కుదిరితే కుదురుతుంది లేకపోతే లేదు. భోజనం చేసే వాళ్ళయినప్పుడు భోజనానికి అక్కడికి చేరుకోండి. భోజనం లభిస్తే

భజిస్తారు. లేకపోతే లేదు. సంకల్పమేమీలేదు. ఒక లక్ష్యాన్ని ఉంచుకొని నడుస్తోంది. దానితోపాటే ఆ సంకల్పానికి ఒక ప్రత్యామ్నాయం కూడా ఉన్నది. అది ఏమిటంటే – జరిగిందా అది మన మంచికే! జరక్కపోయినా అదీ మన మంచికే! ఫలానా పని చెయ్యాలన్న ఆలోచనకు సంబంధించి నిశ్చయమేమీ లేదు. ఏది సాధ్యపడిందో (వీలయిందో) అదే సత్యం. ఎవరైనా - "ఇప్పుడు మీరు ఏం చేయాలి?" అని ప్రశ్నిస్తే అంతరాంతరాల్లోంచి "ఏమీ చెయ్యనక్కర్లేదన్న" ధ్వని రావాలి. మహాత్ములైనవారు కృతకృత్యులైన పురుషుల విషయంలో చేయడానికి శేషంగా (మిగిలి) ఏమీ ఉండనట్లే సాధకులైన పురుషుల విషయంలో కూడా వారి హృదయంలో "నేనేమీ చేయనక్కర్లేదు". అన్న భావమే ఉంచుకోవాలి. ప్రస్తుతం భజన, ధ్యానం, జరుగుతోంది. అది ప్రస్తుత వర్తమాన కార్యక్రమంగానే జరుగుతోంది తప్ప భవిష్యత్తు కోసం కాదు. వర్తమాన క్రియలో నడుస్తున్న సాధన విషయంలోని అంతరార్థమేమిటంటే అలాంటి స్థితిలో ప్రాణం పోయినా నష్టం లేదు. భవిష్యత్తులో నేను చేయాల్సిందేమీ మిగిలిలేదు. జరిగేదంతా భగవదిచ్ఛాను సారమే జరుగుతోంది. జరిగేదంతా కూడా సరియైన విధంగానే జరుగుతోంది. నా ద్వారా జరిగేది కూడా పరమేశ్వరానుగ్రహం వల్లనే వాని కోరిక మీదనే జరుగుతోంది. పరేచ్ఛగా, అనిచ్ఛగా (నిష్కామంగా) జరిగేది కూడా పరమేశ్వరాభిమతంగానే జరుగుతోంది. నాకంటూ చేయవలసిన దేమీలేదు. నా ద్వారా కూడా పరమేశ్వరుడు నిర్వహింపజేస్తున్నది కూడా నాకు మంగళప్రదమైన విషయమే! వాని కోరిక ఎలా ఉంటే అదే తీరులో ఆయన నిర్వహింపజేస్తాడు. నేనేమీ చేయవలసింది లేదు. "జరిగేదంతా సహజంగానే జరుగుతోంది. ఆ పరమేశ్వరుడే నిర్వహింప జేస్తున్నాడు. వానికి నాయందు దయ ఉంది" అని మనస్సులో దృఢ నిశ్చయంతో ఉండాలి. ఈవిధంగా నిశ్చింతులై ఉండండి. ఎలాగంటే టికెట్టు కొనుక్కొని సామాను సర్దుకొని రైలెక్కి కూర్చోడానికి సిద్ధమై రైలొచ్చే మార్గం వైపే చూస్తూ ఉన్నట్లే మానవుడు సమస్త కర్మలనుండి నివృత్తిని పొంది మృత్యువుకై నిరీక్షిస్తూ

ఉండాలి. ఇది ఉత్తమోత్తమమైన భావం. మహాత్ములైన పురుషులకు సహజంగా ఉండే భావము సాధకులకు సాధన యగుతోంది.

కాబట్టి పరమేశ్వరుడికి ఆత్మసమర్పణ చేసుకొని పరమేశ్వరుడు నా ద్వారా నిర్వర్తింపజేసే దంతా సరియైన విధంగానే నిర్వర్తింపజేస్తున్నాడు. అనిచ్ఛగా, పరేచ్ఛగా జరిగేదంతా కూడా సరియైన విధంగానే జరుగుతోంది – అని నిశ్చయంతో ఉంటూ పరమేశ్వరుడికి ఆత్మసమర్పణ చేసుకోవడం మానవమాత్రులమైన మనందరి కర్తవ్యం. భగవంతుని ఏర్పాటులో (శాసనంలో) నిజంగా న్యాయం ఉంది. అది నాకు శుభకరమైనది. అనే తలంపుతో ఉండాలి. సాధకునికి గల ఈ భావం ఉచ్ఛకోటికి చెందింది.

అనుకోకుండా ఎవరబ్బాయైనా మరణించినా, శరీరంలో జబ్బు ఏర్పడినా, ఇంటికి నిప్పంటుకొన్నా అదీ చాలా సంతోషకరమైన విషయమే! దీనికి విరుద్ధంగా పిల్లాడు పుట్టినా, ఇంటికి లక్షల రూపాయలు తరలి వచ్చినా, ఇంకా శరీరానికి స్వస్థత చిక్కినా అప్పుడదీ ఆనందకరమైన విషయమే! గౌరవించినా అవమానించినా అలాగే తెగడినా, పొగిడినా ఈ రెంటిలో ఏ కొంచెం కూడా తేడాలేదు. నిందలాంటిదే స్తుతి కూడా. అలాగే గౌరవం ఎలాంటిదో అవమానం అలాంటిదే! మిత్రుడెలాగో శత్రువూ అంతే! సుఖమూ దుఃఖము లాంటిదే! – ఈ విధంగా సర్వత్రా సమభావంతో ఉన్నవాడే ఉత్తముడు. అలాంటి మహాత్ముల లక్షణాలు శాస్త్రాలలో చెప్పబడ్డాయి. శాస్త్రాలలో చెప్పబడిన మహాత్ముల లక్షణాలు లక్ష్యంగా చేసికొని అభ్యాసం చేసే వాడు తప్పక మహాత్ముడవుతాడు. ఇది బహు అమూల్యమైన విషయం. మహాత్ములలో సహజ సిద్ధంగానే ఉండే విషయం. ఇది సాధకులకు ఆదర్శమైన సాధన విషయం. ఈ విధంగా సాధనగా భావించి అభ్యాసం గావించిన మానవుడు ముందు ముందు శీఘ్రమే మహాత్ముడవుతాడు. ఏ వ్యక్తి తిట్టినా ఆనందంగానే భావించండి. స్తుతించినా ఆనందంగానే భావించండి. వాటిల్లో కించిత్తైనా భేదాన్ని చూడకండి. నిందాస్తుతులు రెండూ వాక్కుకు సంబంధించినవి.

అది ఆకాశానికి సంబంధించిన గుణం, శబ్దం మాత్రమే అని గ్రహించండి. ఇందులో మంచి అని, చెడ్డ అని ఏముంది? నిందైనా, స్తుతైనా పేరుకే! నేను నామరహితుణ్ణి. మానావమానాలు రూపానికి, దేహానికి నేను రూపం నుండి దేహం నుండి పూర్తిగా భిన్నుణ్ణై ఉన్నాను. నాకు గౌరవం లేదు. నాకు నిందలేదు, స్తుతిలేదు. దీనితో నాకెట్టి సంబంధమూ లేదు. ఈ విధమైన జ్ఞానం ఆత్మోద్ధరణ కారకమైంది.

## ప్రేమ, నిష్కామభావం

ఇప్పుడు ప్రేమకు సంబంధించి ఆలోచిద్దాము! ప్రేమ ఎవరితో కలిగియున్నాసరే, నిజానికి ఆ ప్రేమకు ఉద్దేశ్యం "భగవంతుని ప్రసన్నత గూర్చియే యుండాలి. ప్రేమ స్వచ్ఛమైనదై ఉండాలి. అందులో ఏ కోరిక ఉండకూడదు. నిష్కామమైన ప్రేమ ఆత్మోద్ధరణ చేసేదిగా ఉంటుంది. నిష్కామమైన ప్రేమ ఇతరుల యందు, సకామమైన ప్రేమ భగవంతునియందు, ఉన్నప్పుడు ఈ రెంటిలో నిష్కామమైన ప్రేమ యొక్క గొప్పతనమే అధికమైనది. ఈ నిష్కామమైన ప్రేమ భగవంతుని యెడలనే ఉన్నప్పుడు దాని మహిమను ఇక వేరే చెప్పనక్కర్లేదు గదా! "నేను భగవత్ప్రాప్తి కోసం – భగవత్ప్రీతి కోసమే అందరినీ ప్రేమిస్తున్నాను." – అన్న భావాన్ని కలిగి ఉండాలి. ఈ భావం కూడా నిష్కామమైన దానితోనే సమానం. ఎవరైనా ఒకవేళ భగవత్ప్రాప్తి కోసం లేదా భగవత్ప్రీతి కోసం ప్రేమించకుండా కేవలం తన కర్తవ్యంగానే భావించి అందరిని నిష్కామభావంతోనే ప్రేమించినట్లయితే అప్పుడు దాని ఫలితం కూడా పరమాత్మ ప్రాప్తియే అవుతుంది. కాబట్టి మనం నిష్కామ భావంతోనే ప్రేమించాలి. ఇది చాలా విలువైన విషయం. ఎవరితోనైనా పరస్పరం ఉచ్చకోటికి చెందిన ప్రేమ ఉంటే అక్కడ లజ్జ, అభిమానం, భయం, ఆదరం వంటివి ఉండవు. ఒకవేళ ప్రేమికుని పట్ల గల వ్యవహారంలో లజ్జ, అభిమానం, భయం, ఆదరం ఉండిన యెడల ఆ ప్రేమను ఉచ్చకోటికి చెందినదిగా భావించవలదు. అలాంటి ఉచ్చకోటికి చెందిన ప్రేమ భగవంతుని యెడల

ఉండే పక్షంలో (దానిగురించి) వేరే చెప్పనక్కర్లేదు గదా! భగవత్ప్రాప్తి కేవలం ప్రేమతోనే సాధ్యమవుతుంది; కేవలం శ్రద్ధతోనే కలుగుతుంది. కేవలం పవిత్ర భావనతోనే వీలవుతుంది. కేవలం సత్యమైన ఆచరణ వల్లనే లభిస్తుంది. అలాగే కేవలం పరోపకారంతో కూడా భగవత్ప్రాప్తి కలుగుతుంది. కాని ఆ పరోపకారం నిష్కామభావంతో కూడినదై ఉండాలి. ఒక మనిషి ధన చింతన లేకుండాగాని, ఆ ధనం వల్ల సిద్ధించే స్వార్థాన్ని త్యాగం చేసి గాని ఇతరులకు ఉపకారం చేస్తున్నాడనుకోండి. అందులో రూపాయిల త్యాగం ఉంది. శారీరక విశ్రాంతికి సంబంధించిన త్యాగం కూడా ఉంది. కాని దానిలో సకామభావానికి సంబంధించిన త్యాగం లేదు. కాబట్టి కేవలం విశ్రాంతినో, రూపాయలనో త్యాగం చేయడం ఉచ్చకోటికి సంబంధించిన త్యాగం కాదు.

శారీరక విశ్రాంతిని కోరకపోయినా "దీనివల్ల నాప్రతిష్ఠ పెరుగుతుంది.; గౌరవం కలుగుతుంది; గొప్పతనం వచ్చి పడుతుంది; తద్వారా సత్కారం జరుగుతోంది" - అనే ఉద్దేశ్యం మనస్సులో ఉన్నట్లయితే అతని పరోపకారం సకామమైనదే అవుతుంది. అభిమానం, గొప్పతనం, ప్రతిష్ఠలకు సంబంధించిన కోరిక లేకుండా స్వర్గాన్ని పొందాలనే కోరిక ఉన్నట్లయితే అట్టి కర్మకూడా సకామమే అవుతుంది. ఒకవేళ అది మోక్షానికి సంబంధించిన కోరిక అయితే మాత్రం అందులో ఆక్షేపణ ఏమీ ఉండదు. ఈ కోరిక నిష్కామమైన దానితో తుల్యమైనదే! అయితే ఇది కూడా పరిపూర్ణంగా నిష్కామమైనదికాదు. ఎందుకంటే ముక్తికి సంబంధించిన కోరిక కూడా అప్పుడప్పుడు ఆటంకములను కొని తెచ్చి పెడుతుంది. ఉదాహరణకి ఒక సోదరుడు నన్ను ముక్తి కోసం ప్రేమిస్తున్నాడనుకోండి. కొంత కాలమయ్యాక నాకు సేవ చేయడం వల్ల వానికి ముక్తి కలుగబోలదని అర్థమైందనుకోండి. అప్పుడు అతడేం చేస్తాడు? నాకు సేవ చేయడం మానేస్తాడు. దీనివల్ల మోక్షేచ్ఛకూడా బాధకమే అయిందని తేలుతుందికదా! మోక్షేచ్ఛ కూడా లేకుండా ఉన్నట్లయితే మా యిద్దరి ప్రేమ ఎప్పుడు తగ్గేది

కాదు. ఇందువల్లనే మహాత్ములైన వారు సోదరులెవరిపైననైనా ప్రేమ చూపించేటప్పుడు నిష్కామ భావంతోనే చూపిస్తారు. అందువల్లనే వారి వైపు నుండి ప్రేమ ఎప్పుడూ తగ్గిపోదు. ప్రేమించబడ్డ సోదరుడే ప్రేమలో లోపం చేసి ప్రేమను తగ్గించుకొంటాడు తప్ప - మహాత్ములైన వారెప్పుడూ నిష్కామ భావంతోనే ఇతరులకు ఉపకారం చేస్తారు. ఈ విధంగానే మనం కూడా నిష్కామభావంతోనే ఇతరులకు ఉపకారం చేయాలి. ప్రజలకు నిష్కామభావంతోనే సేవ చేయాలి. భగవంతుడు నిష్కామభావంతోనే సేవ చేస్తున్నాడు తప్ప ఆయన మనస్సులో ఏవిధమైన కోరిక లేదు. లోకోద్ధరణ చేయడమే ఆయన స్వభావం. ఈ విధంగానే మహాత్ములకు కూడా అకారణంగానే పరోపకారం చేసే స్వభావమే ఉంటుంది. అందులో వారికి ఎట్టి స్వార్థమూ ఉండదు.

అలాంటివారికి అట్లు చేయడం వల్ల గాని, చెయ్యక పోవడం వల్లగాని ప్రయోజనం ఉండదు. వారికి సమస్తప్రాణికోటిలోనూ వేటియందు కూడా కించిన్మాత్రమైనా స్వార్థం ఉండదు. వారి ద్వారా సమస్త కార్యాలూ సహజంగానే లోకోపకారం కోసమే జరుగుతూంటాయి. ఈ విషయం పరమాత్ముడు భగవద్గీత మూడో అధ్యాయం, 18వ శ్లోకంలో పేర్కొన్నాడు.* ఇవి మహాత్ములయొక్క లక్షణాలు. మనం వీటిని లక్ష్యంగా పెట్టుకొని వాటిని అనుసరించాలి. ఈ విధంగా బోధపరుచుకొని సాధన చేసే సాధకుని అంతఃకరణం అతిశీఘ్రంగా పవిత్రమవుతుంది.

నిష్కామభావంతో సేవలు చేస్తూ "నేను నాకర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాను" అని భావించేవాడి విషయం భగవంతుడికి తెలుస్తూనే ఉంటుంది. దాని పరిణామం మనకు శుభమే అవుతుంది. ఇందులో కూడా సూక్ష్మంగా విచారించి చూచినట్లయితే "కోరికే" కనిపిస్తుంది. కాబట్టి అలాంటి కోరిక

---

* నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః॥

కూడా పెట్టుకోకూడదు. ఫలితం వైపు ఎప్పుడూ దృష్టి పెట్టకూడదు. **"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన"** అని తలంచాలి. (అంటే నాకు కేవలం కర్మ చేసే అధికారమే ఉన్నది. ఫలితం విషయంలో ఎట్టి అధికారమూ లేదు) కనుక అనధికారికమైన ప్రయత్నం చేయడం కూడా తప్పే అవుతుంది.

ఉపర్యుక్త వివేచనానుసారం సాధన చేయడం వల్ల శీఘ్రంగా భగవత్ప్రాప్తి కలుగుతుంది.

* * *

# 3. సత్యనిష్ఠ వల్ల భగవత్ప్రాప్తి

**భ**గవంతుడు భగవద్గీత 17వ అధ్యాయం, 23వ శ్లోకంలో ఇలా పేర్కొన్నాడు.-

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥**

"**ఓం, తత్, సత్** - అను ఈ మూడు శబ్దాలు సచ్చిదానంద పరబ్రహ్మ వాచకములని చెప్పబడినవి. వానిచే సృష్ట్యాది యందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞాదులు రచింప బడినవి."

**ఓం, తత్, సత్** - ఈ మూడూ పరమాత్మని పేర్లు. వీటిని ఏఏ స్థానాల్లో ప్రయోగించాలో ఆ విషయం 'గీత'లో చెప్పబడింది. ఇక్కడ వీటిలో "సత్" అనేది సాక్షాత్తు ఆ పరమాత్మని నామము. పరమాత్మ స్వరూపం కూడా సత్తే. "సత్"ను ప్రయోగిస్తూ భగవద్గీతలో భగవానుడిలా అన్నాడు -

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥** (17:26)

-"సత్"- అనే ఈ పరమాత్మని నామం సత్యభావంతోను, శ్రేష్ఠ భావంతోను వాడబడుచున్నది. అటులనే ఉత్తమకర్మ మందును (శుభకార్యమునందు) సత్తను శబ్దము ప్రయోగింపబడుచున్నది."

**యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥** (17:27)

"యజ్ఞము, దానము, తపముల యందలి స్థితి సత్తని చెప్ప బడుచున్నది. మరియు భగవత్ప్రీతికై చేయు కర్మలు కూడా నిశ్చయంగా "సత్" అని చెప్పబడుచున్నవి."

"సద్భావే సాధుభావేచ" "సత్" శబ్దము భావంలో అనగా అస్తిత్వంలో, సాధుభావంలో అంటే శ్రేష్ఠభావంలో ప్రయోగింప బడుచున్నది. 'సత్' శబ్దము యొక్క ప్రయోగము పరమాత్మని స్వరూప విషయంలో చేయబడినది. ఎందుకంటే పరమాత్మ స్వరూపము "సత్" అనగా సత్యస్వరూపము. — గీతలో ఈ విధంగా చెప్పబడినది —

నా సతో విద్యతే భావో, నా భావో విద్యతే సతః (2:16)

" 'సత్' కాని వస్తువుకు ఉనికి అంటూ ఉండదు. అలాగే 'సత్' అనుదానికి ఉనికి లేకపోవడమంటూ ఉండదు."—

ఈ సిద్ధాంతాన్ని బట్టి పరమాత్ముడు "సత్" స్వరూపుడు. ఆయ నకెప్పుడూ ఉనికి లేకపోవడమంటూ ఉండదు. కాబట్టి 'సత్' శబ్దం పరమేశ్వర స్వరూప వాచకం. హృదయంలోని ఉత్తమ భావాన్ని అంటే శ్రేష్ఠభావాన్ని "సద్భావం" అని పిలుస్తారు. అలాగే శుభప్రదములైన ఉత్తమ కర్మలు (సాధన) కూడా 'సత్' అని పేర్కొన బడినాయి. "ప్రశస్తే **కర్మణి"** అనే దానిలో ఈ విషయం చెప్పబడింది. అనగా "సత్" శబ్దం సద్భావంలో (అస్తిత్వంలో) పరమాత్మ స్వరూప విషయంలో అలాగే శ్రేష్ఠభావంలో, ఇంకా ఉత్తమకర్మల్లో ప్రయోగింపబడుతూ ఉంది.

ఏ వస్తువుకు వినాశం కలుగుతుందో అది "అసత్" అనీ, ఏ వస్తువు ఎప్పటికి వినాశం చెందదో అది 'సత్' అని మనము ఈ విషయాన్ని గ్రహించాలి. 'సత్' పరమాత్మ యొక్క నామము, స్వరూపం కూడా కాబట్టి పరమాత్మ నిత్యసత్. "పరమాత్ముడున్నాడు" — అన్నది మనం విశ్వసించాలి. అప్పుడు తన స్వరూపము ఎలాంటిదను విష యాన్ని పరమాత్ముడే స్వయంగా తెలియజేస్తాడు. భగవత్ప్రాప్తి కలిగినప్పుడు పరమాత్మస్వరూపం ఎలా ఉంటుందన్న యథార్థజ్ఞానం కలుగుతుంది. పరమాత్మప్రాప్తి జరగనంతకాలం పరమాత్ముని సాకార, నిరాకార, సగుణ, నిర్గుణ స్వరూపాన్ని శాస్త్రాలలో పేర్కొనిన దానినిబట్టి, మహాత్ములు ప్రవచించిన దానిని బట్టి ధ్యానించెదము కాని వాస్తవానికి పరమాత్ముని స్వరూపం మనం ధ్యానించే దానికంటే, భావించే దానికంటే అత్యంత

విలక్షణంగా ఉంటుంది. కాబట్టి పరమాత్మప్రాప్తి కలిగే వరకూ పరమాత్మ యొక్క యథార్థస్వరూపాన్ని మనం అనుభవించలేము. అందువల్ల "భగవంతుడున్నాడు" అనే దాన్ని విశ్వసించటమే మనకు సరిపోతోంది. ఈ విశ్వాసం కలిగినప్పుడు మనకు భగవత్ప్రాప్తి తప్పక కలుగుతుంది. మనకు భగవంతునిపై విశ్వాసం కలిగినప్పుడు, మన హృదయంలో భగవంతుడున్నాడన్న నిశ్చయం కలిగినప్పుడు మనం చేసే సర్వకర్మలూ "సత్" గాను, సాత్త్వికంగాను మార్పు చెందుతాయి. దీనికి నిదర్శనం ఏమిటంటే – భగవంతుడున్నాడన్న విశ్వాసం మనకున్నప్పుడు భగవంతుడు చూస్తూండగా మనం "అసత్ కర్మలు" ఎలా చేయగలిగెదము? ఒకవేళ చేసినా మనకిక భగవంతుని యెడల విశ్వాసమున్నది ఎక్కడ (ఉన్నట్లు)? భగవంతుని యెడల విశ్వాసం ఉన్నవారిద్వారా భగవదాజ్ఞకు విరుద్ధంగా ఏ పనీ జరుగబోదు వారి సర్వకర్మలూ భగవదాజ్ఞానుసారంగానే జరుగుతుంటాయి. భగవంతుడు సర్వవ్యాపియై ఉన్నాడనే జ్ఞానం ఉన్నప్పుడు, మనం ఏది చేసినా భగవంతుడు గమనిస్తున్నాడని, ఏది పలికినా దానినంతటినీ ఆయన వింటున్నాడని తెలిసి నప్పుడు మీరే చెప్పండి! మనం భగవద్విరుద్ధంగా ఎలా మాట్లాడగలం? ఆయనకు వ్యతిరేకమైన కర్మలను ఎలా ఆచరించగలం? కాబట్టి దీనికోసం మనం భగవన్నామాన్ని, రూపాన్ని శరణుపొందాలి!

భగవంతుని నామమైన 'సత్' అనే భగవన్నామాన్ని ప్రతిక్షణం స్మరించడమే భగవన్నామాన్ని శరణు పొందడమగుతుంది. అలాగే భగవత్స్వరూపమైన "సత్"ను ప్రతిక్షణం స్మరించడం కూడా భగవంతుని సత్స్వరూపాన్ని శరణు పొందడమే అవుతుంది. ఈవిధంగా భగవంతుని నామస్వరూపాల్ని శరణు జొచ్చిన వానికి ఎల్లప్పుడు భగవంతుడు ఎల్లెడలా ఉన్నాడన్న జ్ఞానం ఉంటుంది. భగవంతుని స్వరూపం ఎలా ఉంటుందన్న జ్ఞానం లేనప్పటికీ కూడా భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఎందుచేతనంటే భగవంతుడున్నాడన్నది వాని హృదయంలో నిశ్చయమై ఉంటుంది గనుక. ఆయన ఉనికి సార్వత్రికమైనదీ, సార్వకాలికమైనదీ గనుక భగవంతుడు లేని చోటంటూ లేదు. అలాగే భగవంతుడు లేని కాలంలేదు. భగవంతుడు అంతటా ఉన్నాడు. ఎల్లప్పుడూ ఉంటాడు. భగవంతుడు అంతటా ఏవిధంగా

ఉన్నాడో తెలుసుకోవాలంటే భగవద్గీతలోని 13వ అధ్యాయంలోని 13వ శ్లోకం యొక్క అర్థాన్ని అవగతం చేసుకోవాలి.

**సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥**

"(అనాది యైన పరబ్రహ్మము) అది అంతటా కాళ్ళు చేతులూ కలది. అంతటా శిరస్సు, కళ్ళు, ముఖము కలది. ఎందుకంటే అది లోకమందంతటా వ్యాపించి ఉన్నది."

"పరమాత్మ లోకమందంతటా వ్యాపించియున్నాడు" - ఇలాంటి జ్ఞానం ఉండటం వల్ల బహు శీఘ్రంగానే పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. అన్నిచోట్ల ఆయన హస్తాలున్నాయి - దీని అభిప్రాయమేమిటంటే మనం ఏది ఆయనకు సమర్పించినా అన్నిచోట్లా ఆయనే స్వీకరిస్తున్నాడు. ఎందువల్లనంటే ఆయన చేతులు అంతటా వ్యాపించి ఉన్నాయి. అవి ఒక దేశానికే పరిమితమై లేవు. అలాగే "అన్నిచోట్లా ఆయన పాదాలున్నాయి" - అనగా మనం ఎప్పుడు ఎక్కడ పరమేశ్వరునకు నమస్కరించినా ఆయన అక్కడే దానిని స్వీకరిస్తాడు. ఎందుకంటే ఆయన చరణాలు అంతటా ఉన్నాయి, అవి ఒక దేశానికో ప్రదేశానికో పరిమితమై లేవు గనక, హస్తాలు వ్యాపించి ఉన్నట్లే చరణాలు కూడా వ్యాపించి ఉన్నాయి. "సర్వత్రా భగవంతుని నేత్రాలు ఉన్నాయి - దీని భావాన్ని కూడా మనం ఇలా చెప్పవచ్చు. మనం ఏది చేస్తున్నా దానంతటిని పరమేశ్వరుడు గమనిస్తానే ఉన్నాడు. భగవన్నేత్రాలు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి గనుక, మనకు ఇలాంటి భావం ఉన్నప్పుడు మనవల్ల ఎలాంటి దుష్కర్మ జరుగదు. అనగా భగవదాజ్ఞకు విరుద్ధమైన ఏ పనీ జరుగదు. "అంతటా భగవంతుని శిరస్సు ఉన్నది"- ఇలా పేర్కొనడంలోని భావమేమిటంటే మనం పత్రపుష్పాదులేవైతే భగవంతుణ్ణి స్మరించి ఎక్కడ సమర్పించినప్పటికీ అవన్నీ భగవంతుని మస్తకం పైననే అర్పింప బడతాయి. కనుక భగవంతుని శిరస్సు సర్వత్రా వ్యాపించి ఉన్నదని తెలియాలి. అలాగే "సర్వత్రా భగవంతుని ముఖము ఉన్నది" - ఈ కథనంలోని అభిప్రాయం కూడా భగవంతుని ముఖము

సర్వత్రా వ్యాపించి ఉన్నదనియే. కాబట్టి భగవంతునికి మనం ప్రేమతో చేసే భోగం ఏదైనా భగవంతుడు స్వయంగా భుజిస్తాడు. 'గీత'లో ఇలా పేర్కొనబడింది -

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః॥** (9-26)

"ఏ భక్తుడైనా నాకు భక్తితో పత్రము, పుష్పము, ఫలము, జలములలో ఏది సమర్పించునో, అట్టి విశుద్ధాంతఃకరణుడైన, నిష్కాముడైన భక్తుడు ప్రేమతో అర్పించిన పత్రపుష్పాదులను నేను సగుణ రూపంలో ప్రత్యక్షమై ప్రీతితో ఆరగింతును."

దీని వల్ల పరమేశ్వరుడు సర్వత్రా ఉన్నాడు. ఆయన ముఖం కూడా సర్వత్రా వ్యాపించి ఉన్నదని తెలుచున్నది. "సర్వత్రా ఆయన చెవులు ఉన్నాయి." - ఈ కథనంలోని భావం భగవంతుని చెవులు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. అవి ఒక దేశానికి ప్రదేశానికి పరిమితమై లేవు. మనం ఎక్కడ ఏమి మాట్లాడినా భగవంతుడు వాటిని వింటాడు. భగవంతుడు సర్వత్రా వ్యాపించి అంతటా స్థితుడై ఉన్నాడు. దీనిపై భగవంతుని భావమేమిటంటే భగవంతుడు లేనిచోటు అణు మాత్రమైనా లేదు. ఈ విషయాన్ని గ్రహించి మనం ఎల్లప్పుడు భయరహితులమై యుండాలి. మన ప్రభువు సర్వత్రా నిండి ఉన్నప్పుడు మనం ఎందుకు భయపడాలి? అలా గ్రహించిన వాని హృదయంలో నిర్భయత్వం, ధీరత్వం, వచ్చి చేరతాయి. ఇంకా ఘోరాతి ఘోరమైన ఆపదలు వచ్చిపడినా అతడు కలత చెందడు. ఎందుకంటే భగవంతుడు ఎల్లప్పుడు అంతటా అతని వద్దనే ఉన్నాడు. రెండేళ్ళ చిన్నపిల్లవాడు తల్లి ఒడిలో కూర్చొని భయపడకుండా ఉంటాడు. నేను తల్లి ఒడిలో కూర్చొని ఉన్నానని వాడికి తెలుసు. తల్లి ఒడిలో కూర్చొనే చిన్న పిల్లవాడు సైతం భయపడకుండా ఉన్నప్పుడు మనం పిల్లవాడికంటే అధికంగానే తెలివి గలవాళ్ళ మనుకొంటూ కూడా మనం ఎందుకు భయపడాలి? తల్లి ఒడికంటే అది భగవంతుని ఒడి అయినప్పుడు అది ఇలోఽధికంగా మిక్కిలి శ్రేష్ఠత్వాన్ని, నిర్భయత్వాన్ని ఇచ్చేదిగా ఉంటుంది.

అలాంటి పరిస్థితుల్లో మనకు భయమేమిటి? అన్ని చోట్లా భగవంతుని సర్వాంగాలూ ఉన్నట్లే, భగవంతుని ఒడి కూడా అన్ని చోట్లా ఉంటుంది. కాబట్టి తాను భగవంతుని ఒడిలో ఉన్నట్లు భావించే భక్తుని హృదయంలో నిర్భయత్వం, గాంభీర్యం, వీరత్వం, ధీరత్వం వంటి అనేక గుణాలు వచ్చి చేరతాయి. దీని వల్ల ఆతని హృదయంలో ఆత్మ బలం సమకూరుతుంది. అతడెప్పుడూ ఏ పనినీ నేను చేయలేను అని భావించడు. ఆతడెప్పుడూ భగవదాజ్ఞను ఉల్లంఘించడు. ఏది చేసినా భగవదాజ్ఞానుసారమే చేయును. కాబట్టి ఆతనికి యమరాజ్యమన్నా భయముండదు. ఎందుకంటే అలాంటి వానికి శిక్షవేయడానికి యమధర్మరాజుకు కూడా సామర్థ్యం ఉండదు. అపరాధం జరిగినప్పుడే యమధర్మరాజు శిక్షించ గలడు. ముందు చేసిన అపరాధాల ఫలితంగా సంపాదించిన దుఃఖాదులను ఆతడు భగవంతుని మంగళ విధానంగా, మహాప్రసాదంగా భావించి నవ్వుతూ ప్రసన్నతా పూర్వకంగానే స్వీకరిస్తాడు.

భగవంతుని కాళ్ళు, చేతులు, చెవులు మొదలైనవి అంతటా ఉన్నాయి. ఈ విషయం పైన చెప్పబడింది. అయితే సర్వప్రాణుల ఇంద్రియాలూ భగవంతుని ఇంద్రియాలేనా? – అంటే అందరి కళ్ళూ భగవంతుని కళ్ళేనా? అలాగే అందరి చెవులూ భగవంతుని చెవులేనా? ఇత్యాదులన్నీ అవగతం చేసుకోవడం కూడా సరియైనదే! కాని ఇదేకాకుండా ఇంతకంటే కూడా ఒక విశేష విషయం ఉన్నది. అదేమిటంటే భగవంతుని ఇంద్రియాలు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. ప్రాణుల ఇంద్రియాల వలె ఒకదేశానికి ప్రదేశానికి పరిమితమై లేవు. – 'గీత'లో ఇలా పేర్కొనబడింది –

సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్. (13:14)

"అది సర్వేంద్రియ విషయాలను తెలిసినది. కాని వాస్తవానికి సర్వేంద్రియ రహితమైనది."

కాబట్టి కళ్ళు, కాళ్ళు, చేతులు, చెవులు మొదలైన ఇంద్రియాలను గురించి వర్ణించినట్లుగా ప్రాణుల ఇంద్రియాలతో సమానంగా భగవంతుని ఇంద్రియాలు లేవు. ఆయన ఇంద్రియాలు సర్వత్రా వ్యాప్తమై నిరాకారంగా

ఉంటాయి. అవి ఇంద్రియ విషయాలకు సంబంధించిన అనుభవాన్ని సర్వత్రా వ్యాపించియే పొందుతాయి. ఒక ఇంద్రియం అననిచోట్లా ఎలా ఉండగలదని మీరు ప్రశ్నించవచ్చు. చేతులున్నచోట కాళ్ళుండవు. కాళ్ళున్నచోట చేతులుండవు. ఇది నిజమే! కాని వీటి విలక్షణత అలౌకికము. నిరాకార రూపంగా అంతటా ఆయన యొక్క కళ్ళు మొదలైన ఇంద్రియాలున్నాయి. అవి స్వయంగానే సర్వత్రా వ్యాప్తమై యున్నాయి. ఎలా? తీగల లోపల విద్యుత్తు ఉన్నట్లే! ఆ విద్యుత్తులో సర్వశక్తులూ సర్వత్రా ఉన్నాయి. తీగల లోపల శక్తి దాని విద్యుత్తులో సర్వత్రా ఉన్నట్లే, పంఖా ద్వారా గాలికి చెందిన శక్తి దానిలో సర్వత్రా ఉన్నట్లే, శబ్దశక్తి (రేడియో మొ॥ వాటి ద్వారా) అన్నిచోట్లా ఉన్నట్లే, బలానికి సంబంధించిన (యంత్రాలు, రైళ్ళు మొ॥ నడవటానికి) శక్తి అన్నిచోట్లా ఉన్నట్లే, ఫలానాచోట ఫలానా శక్తి ఉన్నదన్నది లేదు. కాని ఆ విద్యుచ్ఛక్తి సర్వత్రా వ్యాపించి ఉన్నది. కాని అది కంటికి కనబడదు. ఈ విధంగానే దీనికంటే ఎక్కువగా పరమాత్మ శక్తి సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఎందుకంటే పరమాత్మ, – విద్యుత్తు, అగ్నికంటే కూడా సర్వథా విలక్షణభావంతో విశేషరూపంగా వ్యాప్తమై యున్నాడు. ఇంకా సర్వత్రా సమానభావంతో ఉన్నప్పటికి విద్యుచ్ఛక్తి తీగలలో విశేషరూపంలో ఉన్నట్లే పరమాత్మ అన్నిచోట్ల సమానభావంతో ఉన్నప్పటికి భక్తుల హృదయాలలో విశేషరూపంతో ఉన్నాడు. భగవంతుడు అన్నిచోట్లా ఉన్నాడు. అంతటా ఉండటం చేత ఆతని కర, చరణాలు, మొదలైనవి కూడా నిరాకర రూపంలోనే సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. "అంతటా, హస్తాలు, పాదాలు ఉన్నాయి" – అన్న దాని అంతరార్థాన్ని ఈ విధంగా చెప్పవచ్చు. హస్తాలు పాదాలకు ఏ శక్తి ఉన్నదో అది అంతటా ఉన్నది. మన నేత్రాలు నేత్రేంద్రియ స్థానాలు. నిజానికి దర్శించే శక్తి నేత్రేంద్రియముదే. అది నిరాకారమైనది కనిపించే కళ్ళు ఇంద్రియ స్థానంలో ఉండటం వల్ల వాటిని "నేత్రాలు" అని పిలుస్తాము. మనం 'చెవి' అని పిలిచేది వాస్తవానికి ఇంద్రియం కాదు. అది శ్రవణేంద్రియ స్థానం మాత్రమే! శ్రవణానికి పనికి వచ్చే శక్తి ఉన్నప్పుడే అది ఇంద్రియమవుతుంది. ఎందువల్ల నంటే

ఇంద్రియం నష్టమైనప్పుడు (పాడైనప్పుడు) చెవి యొక్క గోళం స్థిరంగా ఉన్నప్పటికీ కూడా వినడం లేదుగదా! కాబట్టి వాస్తవానికి ఇంద్రియం నిరాకారమైనది. ఇంద్రియాలకు సంబంధించిన గోళాలు ఇంద్రియాలు కావు. కాని భగవంతుని ఇంద్రియాలు విశేషంగా నిరాకారరూపంలో సర్వత్రా వ్యాపించి ఉంటాయి అను విషయాన్ని మనం గ్రహించాలి.

పరమాత్ముడు సదా, సర్వదా, సర్వత్రా ఉన్నాడు అనే భావాన్ని - మన హృదయంలో కలిగియుండే భగవంతుని నామరూపాల్ని ప్రతిక్షణం స్మరిస్తూ ఉన్నట్లయితే, భగవంతుణ్ణే వాస్తవికంగా శరణు జొచ్చినట్లే అవుతుంది - ఎందుచేతనంటే భగవంతుని నామమూ సత్యమే (సత్తే!). భగవంతుని స్వరూపమూ సత్యమే! (సత్తే!). ఇలాంటి స్మృతిని కలిగి ఉండటం వల్ల హృదయగత భావాలు కూడా సత్తే (సత్యమే) అవుతాయి. అలాగే మనం బాహ్యంగా చేసే పనులు కూడా సత్తే (సత్యమైనవే) అవుతాయి. బాహ్యక్రియ అంతరంగికంగా ఉన్న ఆలోచనను బట్టే ఉంటుంది. అలాగే అంతరంగికమైన ఆలోచన బుద్ధి నిశ్చయాన్ని బట్టి ఉంటుంది. "భగవంతుడున్నాడు" - అనే విషయంలో మన బుద్ధి దృఢ నిశ్చయంతో ఉండే పక్షంలో మన హృదయంలో ఉన్న భావాలు అన్నీ పవిత్రమవుతాయి. అలౌకికమైనమవుతాయి. అలాగే ఉత్తమోత్తమ మైనవి కూడా అవుతాయి. ఎన్ని ఉత్తమ భావాలున్నాయో వాటన్నింటిని "సద్భావం" అని పిలుస్తాం. అలాగే ఉత్తమ కర్మల్ని "సత్కార్మ"లని పిలుస్తాం. దీనికి విరుద్ధంగా ఉండే వాటిని 'అసత్' అని పిలుస్తాం. సత్స్వరూపుడైన భగవంతుణ్ణే శరణు పొందగానే మన బాహ్య క్రియలన్నీ పవిత్రమవుతుంటాయి. సత్యంగా అవుతుంటాయి. అప్పుడు మనం పలికేటప్పుడు సత్యాన్నే పలుకుతాం. మన ఆచరణ కూడా సత్యంగానే ఉంటుంది. మన భోజనం కూడా (భుజించేది) సత్యమే అవుతుంది. అన్యాయంగా ద్రవ్యోపార్జన చేసి భుజింపబడితే అది మిథ్యాభోజనమే అవుతుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే అసత్యంగా ఆర్జించిన దానితో తినే తిండి మిథ్యాభోజనమే! మరో విషయం కూడా ఉంది. మనం బజారు నుండి బియ్యం, గోధుమలు మొదలైన తినే వస్తువులు కొని తెస్తుంటాం. వాటిని కంట్రోల్ (అమలులో ఉన్న) కారణంగా

పోలీసువారు పట్టుకొన్నారనుకోండి. "అప్పుడు మా దగ్గర గోధుమల్లేవు. బార్లీ ఉన్నాయి. బియ్యం లేవు. శనగలున్నాయి" అని చెబుతాం. అలా చెప్పినప్పుడు అది అసత్య (దగా) వ్యవహారమే గదా! కాబట్టి మనం (వాటిని వండుకు) తిన్న ఆ భోజనం మిథ్యా (అసత్య) భోజనమే! తినేటప్పుడేమో బియ్యమూ, గోధుమలు; అదే చెప్పేటప్పుడేమో బార్లీ, శనగలు. ఈ అసత్యం వల్లనే ఆ భోజనం మిథ్యా భోజనమవుతుంది. అటులే సత్యనిష్ఠా పూర్వకంగా సముపార్జించిన అన్నము సత్యమైనది (సత్) అగుతుంది. శాస్త్రానుసారంగా ఉన్న సాత్త్విక భోజనం సత్యమైనది. దానికి విరుద్ధమైన భోజనం అసత్ అవుతుంది. కాబట్టి మనం భుజించే ఆహారం కూడా మనకు సత్యమైనదై ఉండాలి.

బాహ్య క్రియలలో రెండు విషయాలు ప్రధానమైనవి అవి ఆహారం, వ్యవహారం. వ్యవహారంలో (ఆచరణలో) వాక్కుకు సంబంధించిన వ్యవహారం ఒకటి. ఇంద్రియాలకు సంబంధించిన వ్యవహారం మరొకటి. వాగ్వ్యవహారంలో సత్యమైన దేది? – యథార్థమైన, ప్రియమైన, హితమైన వచనాలు పలకడం; అలాగే ఇంద్రియాలకు సంబంధించిన వ్యవహారంలో సత్యమైనదేది? – ఉత్తమ ఆచరణ; భోజనం యొక్క పవిత్రత కూడా మూడు విధాలుగా ఉంటుంది. (1) న్యాయంగా సముపార్జించిన ద్రవ్యంతో ఖాద్యపదార్థాలు కొనుక్కొని మనం భుజించే పవిత్రభోజనం. (2) స్వభావ సిద్ధంగానే పవిత్రమైన వస్తువులు – అపవిత్రం కానివి, శాస్త్రాను కూలమైన పదార్థాల భోజనం పవిత్రమైనది. పప్పులు, బియ్యం ఖిచడీ, రొట్టె, కూరగాయలు, పళ్ళు మొదలైనవి, ఇంకా పాలు, పెరుగు, నెయ్యి మొదలైనవి పవిత్రమైనవల్లే శాస్త్రనిషిద్ధమైన ఉల్లి, వెల్లుల్లి మొదలైనవి మత్తును కలిగించే తామసగుణ ప్రేరకమైన మాదక వస్తువులు, ఇంకా ఎంగిలి వస్తువులు, మాంసం, గ్రుడ్లు ఇవన్నీ కూడా మిక్కిలి అపవిత్రమైనవి. నిషిద్ధమైనవి కూడా. ఈ విధంగానే రాజసగుణప్రేరక వస్తువులు కూడా అసత్యమైనవే (అసత్) బహువిధాలయిన మసాలాలు అంటే ఉప్పు, మిర్చి, పులుపు వస్తువులు (చింతపండు), ఆవాలు మొదలైనవి, తీక్ష్ణమైన, ఎండిన (వేగిన) అతివేడి పదార్థాలు, దాహకారకమైన పదార్థాలు ఇవన్నీ రాజసగుణ ప్రేరక వస్తువులు.

రాజసమైన, తామసమైన పదార్థాలకు సంబంధించిన ఈ రెండు భోజనాలు అసత్యమైనవే (అసత్). సాత్త్వికభోజనమే సత్యమైనది (సత్). కాబట్టి భోజనం కూడా మనకు సాత్త్వికమైనదే కావాలి. ఈ ప్రకారంగా ఒకటి - న్యాయ సముపార్జన ద్వారా సంపాదించిన ధనంతో కొనుక్కొని తినే ఖాద్యపదార్థాలు, సత్యమైనవి (సత్). రెండోది పవిత్రమైన సాత్త్వికమైన పదార్థాలు. అవీ సత్యమైనవే! (3) మూడోరకమైనది ఆచారపూర్వకంగా, శుద్ధిగా తయారు చేసినది - అంటే స్వచ్ఛమైన నెయ్యి, పంచదార, పిండి మొదలైన వాటితో కూడినది - ఇంకా శుద్ధజలంతో శుద్ధి పూర్వకంగా పరిశుభ్రమైన ప్రదేశంలో చేయబడినది; ఇంకా సంస్కరించి శుద్ధి చేసినది అలాగే పవిత్ర భావనతో భోజనం తయారు చేసినట్లయితే ఆ భోజనము పవిత్రమైనది అగుతుంది.

బాహ్యమైన పవిత్రత అంటే ఏమిటి? మన సాత్త్విక కర్మలన్నియునూ సత్యమైనవి (సత్); యజ్ఞ, దాన, తపస్, తీర్థ, వ్రత, ఉపవాస, సేవాదులగు శాస్త్రవిహిత క్రియలన్నీ సత్కర్మలు. ఈ విధంగా భగవద్భజన చేయడం, ధ్యానించడం, భగవత్పూజ చేయడం, నమస్కరించడం, మొదలైన భగవంతుని భక్తికి సంబంధించిన కర్మలన్నీ సత్కర్మలే! శాస్త్రవిహితమైన ఉత్తమ కర్మలన్నియూ సత్యమైనవే! అందువల్లనే మనం చేసే బాహ్యక్రియలన్నీ సత్యమైనవై ఉండాలి. అనగా మన వ్యవహారం కూడా అందరితో (సత్తే) సత్యమైనదే అయిఉండాలి. ఉత్తమమైన, పవిత్రమైన, సాత్త్విక వ్యవహారాన్ని "సత్యవ్యవహారం" అంటారు. "ఈతని వ్యవహారం సత్యమైనది", "ఈతని వ్యవహారం శ్రేష్ఠమైనది"- అని ఈ విధంగా శ్రేష్ఠమైనదని చెప్పడం లేదా సత్యమైనదని చెప్పడం ఒకటే! దీనినే "సాధువ్యవహారం" అని పిలుస్తారు. దీనినే "సత్య(సత్) వ్యవహారం" అని, "సదాచారం" అని కూడా అంటారు. సదాచారం నుండే సమస్త ధర్మం ఉత్పత్తి అవుతుంది. మహాభారతంలో ఇలా పేర్కొనబడింది -

**సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే।**
**ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః॥**

(అనుశాసన 149:137)

"శాస్త్రాలన్నింటిలో ఆచారం ప్రథమమైనదిగా గౌరవింప బడుతోంది. ఆచారం వల్లనే ధర్మం ప్రభవిస్తుంది. ధర్మానికి ప్రభువు అచ్యుత భగవానుడు."-

ధర్మపాలనం వల్లనే భగవత్ప్రాప్తి కలుగుతుంది. అందువల్లనే ధర్మానికి ప్రభువు భగవంతుడని, సర్వధర్మాల ఉత్పత్తి ఆచారం వల్లనే జరుగుతుందని పేర్కొనబడింది. ఆచారం రెండువిధాలు - శౌచాచారం, సదాచారం. శౌచాచారం అంటే జలం, మట్టి మొదలైన వాటితో శరీరాన్ని పరిశుద్ధం చేయడం, - అలాగే సదాచారం అంటే అందరియెడల స్వార్థరహితంగా, మమతాహంకార రహితంగా ఉత్తమవ్యవహారం నెరపడం. నేను చెప్పిన బాహ్యమైన సమస్త ఉత్తమ క్రియలు, ఉత్తమ వ్యవహారంలోని అంతర్భాగంగా ఉంటాయి. యజ్ఞం, దానం, తపస్సు, సేవ, పూజ, జపం ఈ విషయాలన్నీ దీనిలో అంతర్గతంగా వచ్చి చేరతాయి. మన ఆచరణ పవిత్ర మగుటకు స్వార్థం, మమత అభిమానం వీటినుండి దూరంగా ఉండి వ్యవహరించడమే ముఖ్యోపాయం. అయితే మనం వ్యవహరించే వ్యవహారంలో మనలో అభిమానం (అహంకారం) కలిగినప్పుడు ఆ వ్యవహారం 'అసత్' అవుతుంది. ఇదే విధంగా క్రోధంతో, లోభంతో చేసే వ్యవహారం కూడా అసత్ అగుతుంది. అలాగే మూర్ఖత్వంతో చేసే వ్యవహారం కూడా అసత్తే అవుతుంది. కాబట్టి సత్యమైన వ్యవహారం ఉన్న వానిలోని అసత్తే కామ, క్రోధ, లోభ, మోహాది దుర్గుణాలు కూడా దూర మవుతాయి. ఎవని హృదయం నుండి సర్వథా దుర్గుణాలు తొలగి పోతాయో, వాని విషయంలో కూడా దానంతటదే సత్యవ్యవహారం నెలకొంటుంది. వానిలో "అసత్తుకు" సంబంధించి కారణాలే లేనప్పుడు వాని వ్యవహారం అసత్తు ఎలా అవుతుంది? అతని వ్యవహారం సహజంగానే పరిశుద్ధమవుతుంది. వ్యవహారానికి సంబంధించిన పరిశుద్ధికి మూలకారణం నిరభిమానత, నిష్కామభావం. హృదయానికి సంబంధించిన నిష్కామభావమే సద్భావం. అదే ఉత్తమమైన భావం; శ్రేష్ఠమైనభావం; సాధుభావం. కాబట్టి హృదయంలో నిష్కామభావం కలిగినప్పుడు మనం చేసే సర్వకర్మల్లో కూడా నిష్కామభావమే ప్రవేశిస్తుంది. ఎవరితోనైనా మీరు వ్యవహరించేటప్పుడు

అందులో మీరు స్వార్థాన్ని త్యజించండి. స్వార్థాన్ని త్యజించి త్యాగం చేస్తున్నాము అనే అభిమానాన్ని కూడా త్యజించండి. అప్పుడు మీ వ్యవహారం దానంతట అదే పరమపవిత్రమైనదీ, ఉచ్చకోటికి చెందినదీ అవుతుంది. ఇటువంటి వ్యవహారమే సద్వ్యవహారం. కాబట్టి మనం మాట్లాడేదికూడా సత్యమైనదే అయి ఉండాలి. మనప్రాణాలు పోయినా సరే, ఎప్పుడూ అసత్యమాడరాదు. భగవానుడు భగవద్గీత 17వ అధ్యాయం లోని 15వ శ్లోకంలో వాక్కు యొక్క తపస్సును గురించి వివరిస్తూ ఇలా పేర్కొన్నాడు – **"సత్యం ప్రియ హితం చ యత్"** వాక్కు ఎలా ఉండాలి? సత్యమైనది, ప్రియమైనది, హితమైనదీ అయి ఉండాలి. ఈ గీతా శ్లోకంలోని ఒక పాదంలో మూడు విషయాలు చెప్పబడ్డాయి. మనువు చెప్పిన ఒక శ్లోకంలోని రెండు విషయాలను విస్తరించి ఇక్కడ భగవానుడు మూడు విషయాలుగా చెప్పాడు. మనువు ఈ విధంగా పేర్కొన్నాడు–

**సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియమ్।**
**ప్రియంచ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః॥** (4:138)

"సత్యాన్ని పలకండి. ప్రియాన్ని పలకండి. కాని అప్రియ సత్యాన్ని పలుకకండి. అలాగని అసత్యమైన ప్రియాన్ని పలుకకండి – ఇది సనాతన ధర్మం."

ఒకవేళ మనువు సత్యాన్ని, ప్రియాన్ని పలకటానికే ఆదేశ మిచ్చాడనుకొన్నా ఇందులో "హిత" శబ్దం ఎందుకు రాలేదన్నది కూడా సరియైనదే. అయితే 'హిత' శబ్దం సత్యం, ప్రియం ఈ రెండింటిలోని అంతర్భాగమే! నిజానికి హితం దేనిలో ఉందో అదే ప్రియమైనది. ఒకవేళ నేను మీకు తియ్యతియ్యగా మనస్సుకు ఆనందం కలిగించే విషయమే చెప్పాననుకోండి. అది మీకు భవిష్యత్తులో కీడు చేసేదిగా ఉన్నదయితే మీకు యథార్థం తెలిసినప్పుడు అప్పుడు మీరే అంటారు. వాడు మాటలయితే తియ్యతియ్యగానే చెప్పాడు. కాని అందులో మాకు అహితమే నిండి ఉంది. అలా నిజానికి ఆ మాట ముందు ముందు ప్రియకారకంగా ఉండదు. కాబట్టి వాస్తవంగా దేనిలో అయితే మనహితం ఉంటుందో అదే యథార్థమైన ప్రియం. హితంగాని మాట మనకు ప్రియంగా అనిపిస్తుందంటే అది మన

అజ్ఞానం వల్ల అలా అనిపిస్తోంది. నిజానికి అది ఆత్మవిరుద్ధమైనదీ, ఆత్మను పతనం చేసేది కావడం వల్లనే అది అప్రియమైనదేగాని ప్రియమైనది కాదు. కాబట్టి మనం ఆ 'ప్రియం' లోనే 'హితం' కూడా నిండి ఉన్నదని అర్థం చేసుకోవాలి. ఇదేవిధంగా 'సత్యం'లో కూడా 'హితం' నిండి ఉన్నది. ఎందుకంటే సత్యమైన మాటే హితకారకమైన దవుతుంది. సత్యం వల్ల ఎప్పుడూ అహితం (కీడు) జరగదు. ఒకవేళ కీడు జరిగే పక్షంలో ఆ మాట సత్యమే కాదు. సత్యవచనము ఒకప్పుడు కఠోరంగాను, అప్రియమైనది గాను అనిపించవచ్చును. కాని సత్యమైన మాట హితము కానిదిగా ఉండబోదు. కాబట్టి ఆయన (మనువు) హితశబ్దాన్ని వేరుగా చెప్పకుండా "సత్యాన్ని పలకాలి. ప్రియాన్ని పలకాలి" – అనే చెప్పాడు. మరయితే భగవంతుడు "హిత" శబ్దాన్ని ఎందుకని ప్రయోగించాడు అని అడిగే పక్షంలో దానిని వివరించటానికి ఈ క్రింది విషయాన్ని సమాధానంగా చెప్పవచ్చు. ఎందుకంటే చాలా మంది దీనిని సరైనదని గ్రహించడం లేదు. వాళ్ళు ప్రియమైన మాట కూడా అహితం (కీడు చేసేది) కాగలదు అని అనుకొంటున్నారు. అందుచేతనే భగవానుడు సత్యాన్ని కూడా పలకాలి ప్రియాన్ని కూడా పలకాలి. ఇంకా హితకారకమైన వచనాన్ని కూడా పలకాలి అని చెప్పాడు.

ఇప్పుడు మనం "అసత్" ఎక్కడెక్కడ ఉంటుందో తెలుసుకోవాలి. దీని గూర్చి కూడా కొంచెం లోతుగా ఆలోచించాలి. భవిష్యత్కార్యక్రమాన్ని గురించి పలికే మనిషిలో కూడా అసత్య వచనాలుండే అవకాశం ఉంది. ఉదాహరణకి "నేను రేపు ఫలానా చోటకి వెళతాను" అని మీతో చెప్పాననుకోండి. కాని జబ్బు పడి వెళ్ళలేక పోయాననుకోండి – ఇక్కడ అసత్యానికి అవకాశం ఏర్పడుతోంది. కాబట్టి అలాంటి స్థితిలో నేను ఆలోచించి చెప్పాల్సి ఉంటుంది. "నేను రేపు వెళతాను" అని అలాంటి దృఢసంకల్పం ఎందుకు చెయ్యాలి? రేపటి గురించి ఆలోచించినప్పుడు వీలుంటే బహుశః రేపు వెళ్ళటం సాధ్యపడుతోంది అని చెప్పటంలో అసత్యానికి తావుండదు. వెళ్ళక పోయినా సరే, దానిలో మనమాట అసత్యమైనది కాబోదు.

ఒక కథ ఉంది. ఈ కథ మనకు మహాభారతం వంటి శాస్త్ర గ్రంథాల్లో లభింపదు కాని, ఇది లోకోక్తిగా జనబాహుళ్యంలో వినిపిస్తోంది. ఒకసారి యుధిష్ఠిర మహారాజు వద్దకు ఒక బ్రాహ్మణుడు దానమడగటానికి వచ్చాడు. అప్పుడు యుధిష్ఠిరుడు ఆ బ్రాహ్మణుణ్ణి చూడగానే "మీరు రేపు రాగలరు. రేపే మేము మీకు దానమిచ్చెదము" అని పలికెను. ఇది విన్న అర్జునాది సోదరబృందం హర్షోల్లాసంతో ఉత్సవాన్ని జరుపుకొన్నారు. అప్పుడు ధర్మరాజు అర్జునుడితో "సోదరా! నేడు మీరంతా ఉత్సవంగా జరుపుకొంటున్న పండుగ ఏమిటి?" అని ప్రశ్నించాడు. అర్జునుడు - "ప్రభూ! నేడు గొప్ప ఉత్సవం. ఉత్తమోత్తమమైన పర్వదినం." - అని బదులు పలికాడు. ధర్మరాజు "ఏమిటి?" అని మళ్ళీ ప్రశ్నించాడు. అర్జునుడు - "తమరు ఆ బ్రాహ్మణునితో రేపు దానమిస్తానని పలికారు. మీరు సత్యవ్రతులైన మహాత్ములు గదా! మీ మాట అబద్ధం కాబోదు. అందుచేత రేపటి వరకూ మీదర్శనం మాకందరికీ తప్పక కలుగుతుందని నిశ్చయమై పోయింది." అని జవాబిచ్చాడు. యుధిష్ఠిరుడు - "అహో! నేను అలా పలికి ఎంతటి గొప్ప తప్పు చేశాను! అని అనుకొన్నాడు - ఇందులోని భావమేమిటంటే ప్రభో! మీవంటి పురుషులు ఈ విధంగా భవిష్యత్తుకు సంబంధించిన వాగ్దాన వచనాలు పలుకరాదు అన్నది ఇక్కడ అర్జునుడి ఆంతర్యం. అయితే ఈ మాటలు అన్నగారికి ఉపదేశించే ఉద్దేశ్యంతోనే పలికినాడు. కాని ఆ విధంగా చెప్పకుండా పైన పేర్కొన్న అందమైన శబ్దాల్లో సంకేతించాడు. అది అతనికి యోగ్యమైనది."

దీని నుండి మనం ఒకనీతిని గ్రహించాలి. మనం కూడా ఎక్కడా భవిష్యత్కార్యక్రమాన్ని గురించి చెప్పేవచనాలు పలుకరాదు. అలా చెప్పటవలన అది అసత్యమయ్యే అవకాశం ఉండును. ఈ విధంగా మన హృదయంలో భవిష్యత్తును గూర్చిన సంకల్పం కూడా చేయరాదు. ఒకవేళ భవిష్యత్తును గురించి దృఢసంకల్పం చేసి దానిని నెరవేర్చటాలని పక్షంలో మన హృదయంలోని సంకల్పం అసత్యమైనదై పోతుంది. హృదయగత సంకల్పం అసత్యమైన దగుట వలన దానిని మనం నెరవేర్చటానికి మళ్ళీ జన్మ నెత్తాల్సి వస్తుంది. మనం నిశ్చయంగా కలకత్తా వెళ్ళుతాము అని మనస్సులో

సంకల్పించుకొన్నాక ఏదైనా కారణాంతరాలవల్ల మనం మరణించామనుకోండి. మరణానంతరం మళ్ళీ జన్మ కలకత్తాలోనే జరుగుతోంది. మరణానికి ముందు మనహృదయంలోని దృఢసంకల్పం నెరవేరలేదు కాబట్టి - ఆ సంకల్పం నెరవేరటానికి మళ్ళీ మనం ఎప్పుడో ఒకప్పుడు కలకత్తాలో జన్మనెత్తాల్సి వస్తుంది. ఇక రెండవ విషయం - పదేపదే ఒక మనిషి అబద్ధమాడుతూంటే అతని వాక్కు ఎప్పుడూ సత్యాన్ని ప్రతిష్ఠించేది కాజాలనట్లే మనం మన సంకల్పాన్ని మళ్ళీ మళ్ళీ మారుస్తూ పోతూంటే మన హృదయంలో సత్యసంకల్పం యొక్క ప్రతిష్ఠ జరగదు. పతంజలి మహర్షి ఇలా చెప్పాన్నాడు -

"సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్।" (యోగ 2:36)

"సత్యప్రతిష్ఠ జరిగాకనే వక్త యొక్క క్రియ ఫలవంతమైనదవుతుంది"

సత్యవాది యైన పురుషుని వాక్కు ఏదైనా సత్యమౌతుంది. పూర్వ కాలంలో సత్యవ్రతులైన తాపస పురుషులు ఎవరినైనా శపిస్తుండేవాళ్ళు, వరాలు ప్రసాదిస్తుండే వాళ్ళు, ఆశీస్సులందిస్తూండే వాళ్ళు అవన్నీ సత్యమౌతూండేవి. ఇదంతా వాళ్ళు సత్యవ్రతులై ఉండటం వల్లనే జరుగుతూండేవి. సత్యం పలుకని మనుష్యునిలో సత్యప్రతిష్ఠ జరగదు. అందువల్ల అతని వాక్కు ఫలించదు. ఈ విధంగా మిథ్యాసంకల్ప వికల్పాలు చేసే మనిషియొక్క, సంకల్పించిన సంకల్పం యెడల ఆదరం లేని మనిషి యొక్క సంకల్పం కూడా సత్యం కాదు. కనుక మనసంకల్పాన్ని సత్యమైనదిగానే సంకల్పించాలి. అనగా సంకల్పాన్ని మార్చరాదు.

వాక్కు యొక్క సత్యసంధత కంటే హృదయగతమైన (మానసిక) సంకల్పం యొక్క సత్యత శ్రేష్ఠమైంది. వాక్కు యొక్క సత్యసంధత అంటే బాహ్యమైన సత్యసంధత; హృదయగత భావాలకు సంబంధించిన సత్యసంధత అంటే ఆంతరంగికమైన సత్యసంధత. వాక్కు యొక్క సత్యసంధతకంటే అధికంగా విలువైనది. దీనికంటే కూడా "భగవంతుడున్నాడు." ఆయన సత్యము, నిత్యము." - అనే మన నిశ్చయ బుద్ధి విలువైనది. మనకు ఇటువంటి హృదయగతమైన నిశ్చయబుద్ధి ఎంత అధికంగా, దృఢంగా ఉంటే

అంతగా మనం భగవత్సమీపానికి అతి చేరువ కాగలం. కాబట్టి మనసులో విశేషమైన దృఢత్వం, విశ్వాసం కలిగి ఉండటంతోపాటు "భగవంతుడున్నాడు. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. భగవంతుడుండగా మనం ఎందుకు చింతించాలి? ఏల భయపడాలి? భగవంతుడున్నాడు. ఆయన మనకు లభిస్తాడు. మరి అలాంటప్పుడు మనం ఏమీ లేనివాళ్ళలా ఎందుకుండాలి? మన కింకా చేయాల్సిందేముంది? నిశ్చయంగానే మనకు ఇదే పని చేయడం ఉచితం" - అన్న నిశ్చయం కలిగి ఉండాలి.

వాక్కు యొక్క "అసత్యతకు" అవకాశం మరెక్కడ ఉన్నది? మనిషికి క్రోధం కలిగినప్పుడు అతడు క్రోధానికి వశీభూతుడై అర్థంలేకుండా వ్యర్థప్రలాపం చేస్తాడు. కాబట్టి సత్యసంధతను అభ్యసించే వారు క్రోధం వహించకూడదు. నిజానికి సత్యవ్రతులైన పురుషులకైతే క్రోధం రానేరాదు. వారి హృదయంలోని ఆలోచనలు సత్యమైనవిగా ఉంటాయి. క్రోధం అసత్ యొక్క మూలకారణం. ఇంకా లోభం, కామం వంటి దుర్గుణాలన్నీ కూడా అసత్ యొక్క మూలకారణాలే! ఎందుచేతనంటే లోభియైన వారు, కామియైన పురుషులు అడుగడుగునా అసత్యాన్నే పలుకుతూంటారు. కాని ఎవరి హృదయంలో సద్భావం ఉంటుందో, వారి కర్మలన్నీ కూడా సత్‌గానే (సత్యమైనవిగానే) అవుతాయి.

సత్-భావం- అంటే ఏమిటి? - దీని వర్ణన భగవద్గీతలో మానసిక తపస్సు అనే పేరుతో చెప్పబడింది.

**మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।**
**భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥** (17:16)

"మనస్సున ప్రసన్నత, శాంతభావం, భగవచ్చింతన చేసే స్వభావం, మనో నిగ్రహం, అంతఃకరణభావాలలో చక్కని పవిత్రత అనే వాటిని "మానసిక తపస్సు" అని అంటారు."

ఇవన్నీ సద్భావాలు. ఇలాంటి సద్భావాలున్నప్పుడు హృదయం పవిత్రమవుతుంది. అలాగే వాని హృదయంలో రాగద్వేషాలూ, కామ క్రోధాలు, లోభ మోహాదులు అయిన అసద్భావాలు ఉండవు. ఈ అసత్

భావాలున్నప్పుడు అంతఃకరణ యొక్క పవిత్రత గుర్తించబడదు. కాని, అతని హృదయంలోనే దోషాలు లేనప్పుడు, అతని వాక్కు మొదలైన కర్మల్లో దోషాలెట్లుండును? హృదయంలో లేని విషయం బాహ్యవ్యవహారంలోకి ఎలా వస్తుంది?

సాదకులు ముందుగా బాహ్యమైన పవిత్రత కోసం ప్రయత్నించాలి. అయితే బాహ్యమైన పవిత్రత అంటే ఏమిటి? ఆహారానికి సంబంధించిన పవిత్రత, వ్యవహారానికి సంబంధించిన పవిత్రత, వాక్కుకు సంబంధించిన పవిత్రత. (ఆహారశుద్ధి, వ్యవహారశుద్ధి, వాక్శుద్ధి). సత్యమైనది, ప్రియమైనది, హితమైనది అయిన వాక్కే శుద్ధమైన వాక్కు. సత్యవచనాలు పలికేటప్పుడు అధికంగా మాట్లాడరాదు. మితభాషికావాలి. అలాగే ఇతరులను నిందించడం, స్తుతించటం చేయరాదు. నిందాస్తుతులు చేసేటప్పుడు ఆవేశానికిలోనై, మనిషి అధిక ప్రసంగం చేస్తాడు. స్తుతించే పక్షంలో స్తుతి కూడా అధికంగా చేయబడుతుంది. అలాగే నిందించినా ఆ నింద కూడా అధికంగానే చేయబడుతోంది. కాని ఏమాట ఎలా విన్నామో, చూశామో, అర్థంచేసుకొన్నామో అలాగే చెప్పటం దానికంటే ఎక్కువగా కాకుండా, తక్కువగా కాకుండా చెప్పడమే సత్యవచనం అవుతుంది. తనను పొగుడు కొనేటప్పుడు ఎక్కువగా చెప్పుతాడు, తనని నిందించుకొంటూ తప్పులే పలికినా అది తక్కువగానే చెపుతాడు అలా తక్కువగా చెప్పినా అసత్యమే! అదికంగా చెప్పినా కూడా అసత్యమే! ఏమాటనుగాని విన్నది విన్నట్లుగా, చూసినది చూసినట్లుగా, అర్థమైనది అయినట్లుగా, నిష్కపటంగా చెప్పబడేదే సత్యం అగుతుంది. ఒక వ్యక్తి వచ్చి ఒకవేళ మీరు మాట్లాడింది ఉచితంగా లేదన్నారనుకోండి, అప్పుడు ఏం చెయ్యాలి అని మీరంటే దానికి సమాధానంగా అప్పుడు నాకేమీ చెప్పే ఆలోచన లేదని చెప్పాలి. లేదా మౌనంగా ఉండిపోవాలి. మౌనం కూడా సత్క్రియే. ఏదేని అన్యాయయుక్తమైన, అనధికారికమైన ప్రశ్న వేసినప్పుడు మీరు మౌనం వహించాలి. ఒకవేళ దొంగవాడు మీ డబ్బెక్కడ ఉన్నది అని ప్రశ్నిస్తే రూపాయలపెట్టె అక్కడ పడి ఉందని బొత్తిగా చెప్పనే చెప్పం. వాడికి

చెప్పటానికి మనం బాధ్యులంకాదు. మనం వ్యాపారం చేస్తాంటాం. వ్యాపారంలో మీరు డబ్బులు ఎలా సంపాదించారని, దాని రహస్యాన్ని గురించి ప్రశ్నిస్తే దానికి సమాధానం చెప్పనూగలం చెప్పకుండా ఉండనూగలం. ఇందులో మనం స్వతంత్రులం. బాధ్యులం కాదు. చెప్పటానికేమీ విషయం లేనప్పుడు ఈ విషయంలో మేం చెప్పే ఆలోచన ఏమీ లేదని చెప్పవచ్చు. మీ సాధన స్థితి ఎందాకా వచ్చిందని మిమ్మల్ని గాని, లేదా ఒకమహాత్ముడైన పురుషుణ్ణి మీకు భగవత్ప్రాప్తి కలిగిందా? లేదా అనిగాని ప్రశ్నిస్తే దానికి సమాధానం చెప్పటానికి వాళ్ళు బాధ్యులు కారు –" ఇది వ్యక్తిగతమైన ప్రశ్న కాబట్టి నేను చెప్పలేను అని వారు చెప్పవచ్చు. ఎందుకంటే రహస్యమైన విషయాలు అయోగ్యులైన వారికి చెప్పబడరాలవు. భగవంతుడు 'గీత'లోనే ఇలా ప్రవచించాడు – "హే అర్జునా! నేను నీకు పరమ రహస్యమైన విషయాలు చెబుతున్నాను. నేను చెప్పిన ఈ విషయాలను అయోగ్యుడైన వానికి చెప్పవద్దు."

**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।**
**ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥** (18:64)

"సంపూర్ణ గోప్యాతిగోప్యమైన నా యీ వచనాలను నీవు మరలా వినుము, నీవు నాకు మిక్కిలి ఇష్టుడవు కాబట్టి ఈ పరమ హితవచనాలను నీకు తెల్పెదను."– అని తెలిపి – ఇంకా ఈ విధంగా ఆదేశించాడు –

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥** (18:65)

"ఓ అర్జునా! నీవు నన్నే తలంచుము. నా భక్తుడవు కమ్ము. నన్ను పూజించు వాడవుకమ్ము. నాకు నమస్కరింపుము. ఇలా చేయడం వల్ల నీవు నన్నే పొందెదవు. నీవు నాకు మిక్కిలి ఇష్టుడవగుట వలన ఇది నిజమని నీకు శపథము చేసి చెప్పుచున్నాను."

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥** (18:66)

"సర్వధర్మాలను అనగా సకల కర్తవ్యకర్మలను నాయందు త్యజించి నీవు కేవలం సర్వశక్తిమంతుణ్ణి, సర్వాధారుణ్ణి, పరమేశ్వరుణ్ణి అయిన నన్ను ఆశ్రయించుము. నేను నిన్ను సకల పాపాల నుండి ముక్తుని చేస్తాను. నీవు విచారించకుము."

ఈ విధంగా భగవానుడు పరమరహస్య విషయాన్ని చెప్పాడు. ఇంకా అయోగ్యులైన వారికి చెప్పవద్దని నిషేధం కూడా విధించాడు.

**ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన।**
**న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి॥** (18:67)

"నీకు ఉపదేశించిన ఈ గీతాశాస్త్రాన్ని ఏకాలంలో కూడా తపస్సు చేయనివాడికి, భక్తిలేనివాడికి, వినడానికి ఇష్టం లేనివాడికి నన్ను దూషించేవాడికి ఎప్పుడూ చెప్పకూడదు."

భగవానుడు నిషేధిస్తున్నాడు. ఇది రహస్యమైన విషయం. కాబట్టి రహస్యవిషయాన్ని ఇతరులెవరికైనా చెప్పడానికి మనం బాధ్యులం కాదు. ఒకవేళ అన్ని విషయాలు అందరూ చెప్పడానికి బాధ్యులమయ్యే పక్షంలో మరి ఇంక రహస్యమంటూ ఏముంటుంది? కాబట్టి రహస్యమైన విషయాన్ని చెప్పకుండా ఉండటం దోషంకాదు. కాని ఎవరితోనైనా మన వ్యవహారం చెడిపోరాదు. అందరితోను ఉత్తమోత్తమంగానే ఉండాలి. అందరితోనూ వారి మంచి ప్రభావం ఉండేలా, వారు ప్రసన్నులయ్యేలాంటి వ్యవహారం ఉండాలి. అతడు మన వ్యవహారానికి బదులుగా మంచిగా ప్రవర్తించ లేకపోయినప్పటికీ మనం ఉత్తమోత్తమంగానే వ్యవహరించాలి. బాహ్యావ్యవహారం స్వార్థాన్ని, అహంకారాన్ని త్యాగం చేసినట్లయితే ఉత్తమమైనదవుతుంది. స్వార్థత్యాగం కూడా ఏదేని కారణంగా జరిగినపక్షంలో అది నిజానికి స్వార్థత్యాగం కాదు. గౌరవమర్యాదల గొప్పతనం కోసం, స్త్రీ, పుత్ర, ధనాదులకు

సంబంధించిన స్వార్థాన్ని విడనాడినట్లయితే అలాగే స్వర్గాది పరలోకాదుల కోసం స్వార్థాన్ని విడిచి పెట్టినట్లయితే ఆ స్వార్థత్యాగం వాస్తవానికి స్వార్థత్యాగం కానేకాదు. స్వార్థత్యాగం పైన పేర్కొన్నట్లుగాక నిష్కామంగా ఉన్నప్పుడే అది నిజమైన స్వార్థత్యాగం అగుతుంది. అదే నిష్కామ కర్మ. అయితే ఆ నిష్కామభావం కూడా అహంకార రహితం కావాలి. నిష్కామకర్మనాచరించినా నేను నిష్కామకర్మ చేస్తున్నాను అన్న అహంకారం ఉన్నట్లయితే ఆ నిష్కామకర్మలో కళంకమున్నట్లే! కాబట్టి మమత, అహంకారం, స్వార్థం, కోరిక, ఆసక్తి మొదలైన వాటిని త్యజించి చేసే కర్మయే ఉచ్చకోటికి చెందిన "సత్యవ్యవహారం". ఇలాంటి భావనతో జరిగే ఆచరణలన్నీ ఉత్తమోత్తమ శ్రేణికి చెందినవిగా భావించబడతాయి. ఈ విధమైన నిష్కామభావం వల్ల అంతఃకరణ శుద్ధి జరిగి అతనిలో సమానత్వం వెల్లి విరుస్తుంది. ఆ పురుషునికి పరమాత్మప్రాప్తి కలుగుతుంది. భగవత్ప్రాప్తి కలిగిన మనుష్యుని లక్షణాలను వివరిస్తూ భగవానుడిలా పేర్కొన్నాడు -

**ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥ (5:19)**

"ఎవరి మనస్సు సమభావంతో నిలిచి ఉంటుందో వారి ద్వారా ఈ జీవిత దశలోనే సంపూర్ణసంసారం జయించ బడేంది. ఎందుకంటే సచ్చిదానంద ఘనరూపియగు బ్రహ్మ దోషరహితుడు, సముడు అందువల్ల వారు సచ్చిదానంద ఘనుడగు పరమాత్మయందే నిలిచి ఉంటారు."

కాబట్టి ఎవరిలో పరమాత్మ స్వరూపం నెలకొని ఉంటుందో వారి భావం ఉత్తమం, సత్యం, పవిత్రం, సమత్వం కలదై ఉంటుంది. కాబట్టి వారిని మనం అనుసరించాలి ఆ మహాపురుషుల హృదయంతో సమానంగానే సత్యాన్ని, సమత్వాన్ని పవిత్రభావాన్ని నెలకొనేలా చేసుకోవాలి. శుద్ధమైనది (సత్ అయినది), సత్యమైనది, సమమైనదే "సాధుభావం." సాధుభావం ఉండటం వల్ల మన వాక్కుకు సంబంధించిన క్రియ, లేదా మన భాషణం సత్యమౌతుంది. ఇంద్రియవ్యాపారం, మన ప్రవర్తన సత్యమౌతాయి. మన

ఆహారం కూడా సత్యమే అవుతుంది. అప్పుడు యజ్ఞం, దానం, తపస్సు ఇంకా ఎన్ని శాస్త్రవిహితకర్మలుంటే అన్ని కర్మలూ మనద్వారా సత్యమే అవుతాయి. ఇంకా చెప్పాలంటే ఉచ్చకోటికి చెందిన శ్రేష్ఠకర్మలూ, యథార్థకర్మలూ అవుతాయి. ఉత్తమ కర్మలను నిష్కామభావంతో ఆచరించే విషయం భగవానుడు గీతలో ఇలా ఉపదేశించాడు -

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥**
**ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।**
**కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్॥** (18:5,6)

"యజ్ఞ, దాన, తపో రూపమైన కర్మలు త్యజించదగినవి కావు. పైగా అవి అవశ్యకర్తవ్య విషయాలు. ఎందుకంటే యజ్ఞదాన తపఃకర్మలు మూడే బుద్ధి మంతులైన పురుషుల్ని పవిత్రం చేస్తాయి. కాబట్టి అర్జునా! యజ్ఞదాన తపోరూపమైన ఈ కర్మలను, సంపూర్ణమైన కర్తవ్యకర్మల యందు ఆసక్తిని, ఫలాపేక్షను విడిచిపెట్టి తప్పకుండా ఆచరించాలి. ఇది నిశ్చితమూ, ఉత్తమమూ అని నా అభిప్రాయం."

యజ్ఞదాన తపస్సులందలి స్థితి కూడా సత్యమే. భగవంతుడంటాడు -

**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥** (17:27)

"యజ్ఞదాన తపస్సులలో ఉన్నస్థితి కూడా "సత్" అని ఈ విధంగా చెప్పబడుతోంది. అలాగే ఈశ్వరుడి ప్రీతికోసం చేసే కర్మలన్నిటినీ నిశ్చయంగా 'సత్' అని చెబుతారు"

అలాగే భగవంతుని కోసం చేసే కర్మలు కూడా మిక్కిలి 'సత్' కర్మలే! భగవద్గీతలో -

**మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి॥** (12:10)

నా నిమిత్తం కర్మలను ఆచరిస్తూ కూడా మోక్షాన్ని పొందగలవు.

భగవంతుడు సత్తు. ఆయనకోసం చేసే కర్మలు కూడా సత్తే. కాబట్టి మనకర్మలు భగవంతుని నిమిత్తమే (భగవత్ప్రీతి కోసమే) ఆచరించాలి. అయినప్పటికి యజ్ఞదాన తపఃకర్మలు స్వరూపంతో సాత్త్వికమైనవి. కాని వాటితోపాటు తామసగుణ సంబంధం కలిగినప్పుడు అవి 'అసత్'గా మారిపోతాయి. అలాగే ఒకవేళ ఇతరులకు అయిష్టం కలిగించటం కోసం యజ్ఞం, తపస్సు, దానం చేసినట్లయితే అవి 'అసత్'గానే పరిగణింపబడతాయి. స్వరూపంలో 'సత్'గా కనబడినప్పటికి ఆలోచన దూషితమైనట్లయితే 'అసత్'గానే అవుతుంది. ఎందుకంటే ఆచరణకంటే ఆలోచన ఉత్తమమైంది. యజ్ఞదాన తపస్సుల సత్స్వరూపములే. ఇక భగవన్నిమిత్తం ఆచరించడం వల్ల అవి భావంలో కూడా 'సత్'గానే అవుతాయి. కాబట్టి మనం ఆచరించే కర్మలు క్రియలోనూ, భావంలోనూ కూడా 'సత్'గా ఉండాలి. ఎందుకంటే ఈ విధంగా కేవలం సత్యం యొక్క ఆశ్రయంలోనే మనకు మేలు కలుగుతుంది.

బాహ్యక్రియల కంటే కూడా హృదయగతమైన భావనలే శ్రేష్ఠమైనవి. ఎందుకంటే హృదయగతమైన సాధుభావం, పవిత్రభావం, శ్రేష్ఠభావం, సమభావం, నిష్కామభావం అను భావాలన్నీ ఉచ్చకోటికి చెందిన భావాలు. కాబట్టి ఇవి క్రియ కంటే అధికంగా విలువైనవి. మన హృదయగత ఉత్తమ భావాల వల్ల మన బాహ్యకర్మలు సహజంగానే పవిత్రంగా, సత్యంగా అవుతాయి. బాహ్యక్రియలు, 'సత్' అయికూడా ఆంతరంగిక భావాలు "అసత్"గా కూడా ఉండగలవు. అయితే ముందుకు సాగినకొద్దీ వాటి ప్రభావం వల్ల అంతరంగికమైన భావాల శుద్ధి కూడా జరుగుతోంది. ఎందుకంటే పవిత్రమైన భోజనం చేయడం వల్ల అంతఃకరణ శుద్ధి జరుగుతుంది అని చెప్పబడింది.

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" (ఛాందోగ్యోపనిషత్తు 7:26-2)

కాబట్టి ఆహారవ్యవహారాదుల బాహ్యశుద్ధి వల్ల కూడా ఆంతరంగిక శుద్ధికలుగుతోంది. అందువల్లనే సత్కర్మలవల్ల సద్భావం ఉద్భవిస్తుంది.

సద్భావం కలిగినప్పుడు దానిద్వారా అసత్కార్యాలు జరగవుగదా! హృదయంలోని సత్ భావాల కంటే భగవత్స్వరూపం పరమసత్యమైనది; సర్వశ్రేష్ఠమైనది; పవిత్రమైనది. దాని సంగతి చెప్పేదేముంది? భగవంతుని స్వరూపంలో నిష్ఠ కలిగినప్పుడు, భగవత్స్వరూపంలో మన నిశ్చయం చలించకుండా ఉండే పక్షంలో, మన బుద్ధిలో దృఢంగా - భగవంతుడున్నాడని నిశ్చయం కలిగినప్పుడు మహా కష్టాలు వచ్చిపడ్డా విచలితులం కాలేం. ఎందుకంటే భగవంతుని ఉనికిలో (సత్తాలో) అంతటి బలముంది. ఈ స్థితిలో మనమనస్సులో ఎంతటి ఆత్మబలం వస్తుందంటే ఎప్పుడూ మన వల్ల అసద్వ్యవహారం జరుగదు. హృదయంలో అసద్భావం ఉదయించదు. కాబట్టి భగవత్స్వరూపంలో శ్రద్ధాపూర్వకమైన నిష్ఠ కూడా దృఢం చేసుకోవాలి. నిష్ఠ కలిగిననాడు మన ఆచరణ అంతా దానంతటదే పవిత్రమూ శ్రేష్ఠమూ, సత్యమూ (సత్) అవటం మొదలవుతుంది. భగవంతుడు సదా, సర్వదా, సర్వత్రా నిండి ఉన్నాడు - ఇదే భగవంతుని యొక్క ఉచ్చకోటికి చెందిన భక్తి. ఇదే భగవంతుని యెడల శ్రద్ధ (తత్పరత). ఈ ఉచ్చకోటికి చెందిన శ్రద్ధయే (తత్పరతయే) భగవత్ప్రాప్తిని కలుగజేస్తుంది.

ఈ విషయాలన్నీ సత్యానికి సంబంధించిన విషయాల్లో చెప్పబడ్డాయి. పాఠకమహాశయులు సరియైనవిగా భావించినట్లయితే ధారణ చేయవచ్చు. (పాటించవచ్చు) వీటిని ధారణ చేయడం వల్ల (పాటించడం వల్ల)నిశ్చయంగానే మేలు కలుగుతుంది. నేను పాటించినట్లయితే నాకు మేలు కలుగగలదు. మీరు పాటిస్తే మీకు మేలు జరగగలదు. ఎందుకంటే ఇవి భగవంతుని మాటలేగాని నామాటలు కావు. నేను భగవంతుని వాణిని కేవలం నా మాటలలో చెప్తాను. వీటిని పాటించడం కోసం మీ చేత శపథం చేయించడం లేదు. ఎందుకంటే - నాకు ప్రతిజ్ఞ చేయించే అధికారం లేదు. రెండవ విషయమేమంటే - వీటిని మీరు బాగా అర్థం చేసుకోండి; మంచివిగా భావించినట్లయితే ధారణ చేయగలుగుతారు. ఉపయోగంలోకి తెచ్చుకో కలుగుతారు. వీటిని అమల్లోకి, ఉపయోగంలోకి తెచ్చుకోగలిగే

పక్షంలో కేవలం పైన పేర్కొన్న సత్యాన్నే ధారణ చేయడం వల్ల మీకు మేలు కలుగుతుంది. ఇందులో ఎట్టి సందేహమూ లేదు. ఎందుకంటే ఈ విషయాలను భగవంతుడు స్వయంగా ఉపదేశిస్తున్నాడు. శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఇంకా మహాత్ములు ప్రబోధిస్తున్నారు.

కాబట్టి సత్య స్వరూపుడైన పరమాత్మను మీ హృదయంలో, బుద్ధిలో ధరించండి. అప్పుడు మీ ఆలోచనలు, ఆచరణలు వాటంతటవే సత్యమైనవి, శ్రేష్ఠమైనవి, పవిత్రమైనవిగా అవుతాయి. బాహ్యకర్మలను సంస్కరించుకో జాలకపోయినా పెద్దగా నష్టమేమీ ఉండదు. మీరు భగవంతుని యందు నిష్ఠనుంచండి. భగవంతుని యందు విశ్వాసముంచండి. భగవంతుని పై ఆధారపడండి. భగవంతుని శరణు పొందండి. ఆపైన ఆయనకోసం మీరు వేరే ప్రయత్నాలు చేయనవసరం ఉండదు. సర్వకర్మలూ, సర్వభావాలు భగవత్కృప వల్ల వాటంతటవే పవిత్రమైపోతాయి. మీ హృదయంలో భగవంతునిపై నిష్ఠ ఏర్పడినప్పుడు, మీరు శ్రద్ధాపూర్వకంగా భగవంతునిపై అనన్యశరణులైనప్పుడు, భగవంతుడు స్వయంగానే తనంతతానుగానే మీకు ప్రాప్తింపగలడు.

★ ★ ★

# 4. దేశ ఔన్నత్యం కోసం సంస్కృతం, ఆయుర్వేదం, హిందీ ఇంకా భగవద్గీత, రామాయణాల ప్రచారావశ్యకత

## సంస్కృతభాష

వర్తమాన పరిస్థితుల్ని విచారించి చూసినట్లయితే దేశంలో సంస్కృత భాష రోజు రోజుకి క్షీణించిపోతూ ఉన్నట్లు మనకు బోధపడుతుంది. ఇదే క్రమంలో క్షీణిస్తూ పోయినట్లయితే ఒకరోజున మనదేశంలో సంస్కృతభాష లుప్తప్రాయమై పోయినా ఆశ్చర్య పడనక్కరలేదు. పాండవుల పరిపాలనా కాలం వరకూ దీనికి బహుగొప్ప ప్రచారమే ఉండేది. నీతి, ధర్మం, ఆధ్యాత్మిక విషయక గ్రంథాలన్నీ సంస్కృత భాషలోనే ఉండేవి. ఇంకా ఇది రాజభాషగా కూడా ఉండేది. ఎందువల్లనంటే రాజకీయవ్యవహారాలు, శిక్షాస్మృతి మొదలైనవన్నీ మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి మొదలైన స్మృతుల ఆధారంగానే జరుగుతూండేవి. మీతాక్షరశాసనం ఇప్పటికీ కొన్ని రూపాల్లో ఈ స్మృతుల ఆధారంగా దాయభాగం (పంపకాలు) దండనవిధి సాగుతూండేది. సంస్కృత భాష యావద్భారత దేశంలో విస్తృత ప్రచారంలో ఉండేదని, దాని ప్రభావం వల్లనే భారతదేశంలోని నలుమూలలా ఇప్పటికీ సంస్కృతభాష కనిపిస్తోందని, నీతి, ధర్మాలకు సంబంధించిన, ఇంకా ఆధ్యాత్మిక విషయక సాహిత్యాన్ని పరిశీలిస్తే మనం గమనించవచ్చు. సంస్కృత భాష కనబడని ప్రదేశంగాని, జిల్లాగాని భారతదేశంలో లేదు. సంస్కృతం నేర్చిన ఏ పండితుడైనా ఎక్కడికి వెళ్ళినా ఎవరో ఒకరు

సంస్కృతం మాట్లాడే వాళ్ళు తారసపడతారు. అలాగే భారతదేశంలోని ఏ ప్రాంతానికైనా వెళ్ళి చూడండి. ఒకే విధమైన శ్రుతి, స్మృతి పురాణేతిహాసాలే దర్శనమిస్తాయి. ఎక్కడా ఏమాత్రం తేడా కనబడదు. దీనిని బట్టి సంస్కృతభాషయొక్క, ధార్మిక గ్రంథాలయొక్క సనాతనత్వం (అనాదిగా ఉండటం) ఉపాదేయత (అవసరం), విస్తృతి ఎంతటిదో మనకు స్పష్టమవుతుంది. సంస్కృత భాషకి పూర్వం ఏ ఇతర భాషగాని, శ్రుతి, స్మృతి పురాణేతిహాసాలకంటె ముందు మరే ఇతర ధార్మిక గ్రంథాలుగాని, సంస్కృత వర్ణమాలకి పూర్వం ఇతర వర్ణమాల గాని మనకు కనబడవు. వాటిని గురించి చెప్పినట్లుకూడా ఏమీ తెలియదు. దీనిని బట్టి కూడా దీని పురాతనత్వం (అనాదిత్వం) స్పష్టమవుతుంది. బౌద్ధులకాలంలో మత విరోధాల సందర్భంలో సంస్కృత భాష మీద దాడులు జరిగాయి. అయినప్పటికి విక్రమాదిత్య చక్రవర్తి, భోజరాజులకాలంలో సంస్కృతానికి విస్తృతమైన ఉత్తమ ప్రచారమే లభించింది. దీని తర్వాత కాలంలో కూడా కొంత సంస్కృత ప్రాచుర్యం ఉంది. అయితే మహమ్మదీయుల పరిపాలనలో మాత్రం సంస్కృత భాష నశించడానికి చాలినంత ప్రయత్నం జరిగింది.

ఋగ్వేదములో 21 శాఖలు; యజుర్వేదములో 109, సామవేదములో 1000; అధర్వణ వేదములో 50 మొత్తము 1180 శాఖలున్నట్లు, అందులో ఇప్పుడు కేవలం 12 శాఖల వరకూ లభ్యమవుతున్నట్లు తెలుస్తోంది. ఇదే స్థితి వేదాలలోని బ్రాహ్మణ, ఆరణ్యక, కల్పసూత్రాదులకు, వేదాంగాలకు ఇంకా ఇతరమైన ధార్మికగ్రంథాలకు ఉంది. ఈ వైదిక శాఖలన్నిటికీ, అన్యధార్మిక గ్రంథాలకు ఇంతటి నాశనం ఎలా కలిగింది? దీనికి వైదిక ధర్మవిరోధులు, విదేశీయ దుర్మార్గుల ద్వారానే మన ఈ అమూల్య గ్రంథసంపత్తి అంతా నాశనం చేయబడ్డట్టు నిస్సందేహంగా చెప్పవచ్చు. ఉజ్జయినికి చెందిన రాజా మతాదిత్యుడు వేలాది బ్రాహ్మణుల పుస్తకాల నన్నిటినీ తగులబెట్టించినట్లుగా చెప్పబడుతోంది. బౌద్ధులద్వారా "సహ్యాద్రిఖండం" (గ్రంథాలయం) నాశనం

చేయబడ్డ విషయం ప్రసిద్ధమైనది. మహమ్మదీయులు అలెగ్జాండ్రియా యొక్క గ్రంథాలయాన్ని తగులబెట్టారు. మహమూద్, నాదిర్షాలు కూడా సంస్కృతానికి చెందిన లెక్కలేనన్ని ధార్మిక గ్రంథాలను నాశనం చేశారు. కొందరు మహమ్మదీయ చక్రవర్తులైతే సంస్కృతగ్రంథాలను స్నానాల నీటిని వేడి చేసుకోవడానికి తగుల బెట్టించారు. ఈ విధంగా మన ఈ అమూల్యజ్ఞానకోశం ధ్వంసం చేయబడింది. మొదట్లో అయితే వీటిని కొందరు దుర్మార్గులు నాశనం చేశారు. అప్పుడయితే మనం నిరుపాయులం. కాని, ఇప్పుడు రక్షితమైయున్న వాటిని మనం అవహేళన చేస్తూ మూర్ఖత్వంతో నాశనం చేసుకొంటున్నామనేదే మిక్కిలి విచారించాల్సిన విషయం.

కాని దానిని రక్షించుకోవడం మన పరమ కర్తవ్యం. సంస్కృతభాషను రక్షించడం వల్లనే ధర్మం కూడా రక్షింపబడుతుంది. ఎందుచేతనంటే మూల ధార్మిక గ్రంథాలన్నింటికీ ఆధారం సంస్కృత భాషయే. ఈ సంస్కృతభాష ఎంతటి స్పష్టమైనదో మధురమైనదో, దాని తత్త్వమెలాంటిదో దాని అమృతమయ భాషను ఆస్వాదించే పండితులే ఎరుగుదురు. సంస్కృత వ్యాకరణం కూడా అలౌకికమైంది. దీని కున్నటువంటి సర్వాంగ సంపూర్ణమైన వ్యాకరణం ప్రపంచంలో ఏ భాషకూ కనబడదు.

ఇలాంటి సంస్కృతభాషా రూపంలో ఉన్న అలౌకిక రత్నం మన భారతదేశంలో లేకుండా పోయిట్లయితే అది మళ్ళీ ప్రాదుర్భవించటం బహుకష్టమౌతుంది. కాబట్టి ఈ సంస్కృత భాష జీవించి ఉండటానికీ, దీనికి ఉత్తరోత్తరా అధిక ప్రచారం లభించేందుకు ఇంకా సర్వాంగీణ సమృద్ధిప్రాప్తించేందుకు అందరూ శక్త్యనుసారంగా ప్రయత్నించాలని మేము ప్రభుత్వానికీ, దేశవాసులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

## ఆయుర్వేద విజ్ఞానం

ఈ విధంగానే ఆయుర్వేదవిజ్ఞానమునకు కూడా బహువేగంగా నాశం సంభవిస్తూ వస్తోంది. ఆయుర్వేదానికి సంబంధించిన చికిత్స, నిదానం,

ఔషధుల నామ, గుణ, రూప స్వభావాలు, వాటి నిర్మాణానికి సంబంధించిన మహాజ్ఞానమంతా త్రికాలజ్ఞులైన ఋషుల నుంచి వచ్చింది. అది క్రమంగా లుప్తమై పోతోంది. ఇప్పుడు మా అంచనా ప్రకారం అది దాదాపు తొంభై శాతం వరకూ లుప్తమై పోయింది. ఇంకా పరిరక్షింపబడిందేదైనా ఉంటే అది కూడా రోజురోజుకి క్షీణించి పోతూనే ఉంది. శ్రద్ధ గల వైద్యులంతా గతించిపోతున్నారు. మిగిలిన వాళ్ళకు దీనియందు అనాస్థ (అశ్రద్ధ) వృద్ధిపొందుతోంది. దీని పరిణామంగా నేడు దేశంలోని పెద్ద పెద్ద వైద్యులు కూడా తమ పిల్లల్ని డాక్టరీ చదివిస్తున్నారు. స్వయంగా డాక్టరీ మందుల్ని (ఇంగ్లీషు మందుల్ని) వాడుతున్నారు. ఇక్కడ నిశ్చయంగా చెప్పదగ్గ విషయం ఒకటుంది. భారతదేశవాసులకు భారతదేశంలోని ఆయుర్వేదోక్తమైన దేశీయ ఓషధులు ఉపయోగపడ్డట్టుగా విదేశీయమైన ఓషధులు ఉపయోగ పడవు. ఈ విషయంలో ఈ విధంగా కూడా పేర్కొనబడింది.

"యస్య దేశస్య యో జంతుస్తజ్జం తస్యౌషధం హితమ్।"

"- ఏదేశానికి చెందిన జీవులకు ఆ దేశంలో లభించే ఓషధులే హితకరంగా ఉంటాయి."

ఈ దేశంలో ఆయుర్వేదవైద్యం ఒకనాడు ఎంత ఉచ్చస్థితిలో ఉండెనో మహాభారతంలోని ఒక కథ ద్వారా మనం తెలుసుకోవచ్చు. మహాభారతంలోని ఆదిపర్వంలో ఈ కథ ఉంది. అందులో కాశ్యపుడనే పేరుగల ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఆయన మరణించిన వ్యక్తులను కూడా ఓషధులతో (వన మూలికలతో) జీవింప జేయుగల (పునర్జీవింపజేయుగల) శక్తి కలిగి ఉండేవాడు. పరీక్షిన్మహారాజు తక్షకుడనే పాముకాటుకు గురికాబోతున్నాడని తెలియగానే పరీక్షిన్మహారాజు దగ్గరకు చేరాలని ఆయన ఇంటినుండి బయల్దేరాడు. మార్గమధ్యంలో ఆయన తక్షకుణ్ణి కలవడం జరిగింది. మానవరూపధారియైన తక్షకుడు ప్రశ్నించిన మీదట తాను పరీక్షిన్మహారాజును పాముకాటు వేసే పక్షంలో నేను ఆయన్ను ఓషధులతో బ్రతికిస్తానని, ఆ కారణంగానే అక్కడికి వెళుతున్నానని పలికాడు. ఇది విన్న తక్షకుడు తానే

తక్షకున్నాన్నాడు. "నేను కాటేసిన వాడికి నువ్వు చికిత్స చేయలేవు" అని అనగానే కాశ్యపుడు "నేను నువ్వు కాటేసినవాడిని బతికిస్తాను..." అన్నాడు. అప్పుడు తక్షకుడు – "నేను ఈ వృక్షాన్ని కాటువేసి భస్మం చేస్తున్నాను. దీన్ని బతికించుచూద్దాం!" అన్నాడు. తక్షకుడు కాటు వేయగానే వృక్షం కాలిబూడిదయ్యింది. అప్పుడు కాశ్యపుడు – మంత్రబలంతో, ఓషధుల బలంతో దాన్ని పునర్జీవింపజేసి చూస్తూండగానే పచ్చగా మార్చాడు. తక్షకుడు తన పరువు కాపాడుకోవడం కోసం కాశ్యప బ్రాహ్మణుడికి విశేషంగా ధనాన్నిచ్చి ఆయన్ను అక్కడినుండే వెనక్కి పంపించేశాడు.

మనదేశంలో ఆయుర్వేదవైద్యం మరణించిన మనిషినే కాదు సమూలంగా కాలి బూడిదయిన వృక్షాన్ని కూడా మళ్ళీ పచ్చే దానిగా చేయగలిగేంతటి అద్భుతమైన ఉచ్చస్థితిని సాధించినట్లుగా దీని ద్వారా మనకు అవగతమవుతోంది. అలాంటి గౌరవనీయమైన వైద్యానికి మెల్లమెల్లగా క్షీణత సంభవించింది. ఇంకా ఆ క్షీణత కొనసాగుతూనే వస్తోంది. ఇది ఎంత పరితపించాల్సిన విషయం! ఇప్పటికీ ఈ వైద్యవిజ్ఞానాన్ని ఇప్పుడున్న దానిని ఉన్నట్లుగా, (ఇప్పుడు లభ్యమౌతున్నదాన్ని) ప్రభుత్వం, దేశవాసులు, నిష్ఠగల సద్వైద్యులు దృష్టిని సారించి దీని పరిరక్షణకు, పరిశోధనకు, అభివృద్ధికి కృషి చేసినట్లయితే అందులో నిక్షిప్తమైయున్న మహత్తర గుణాలు వెల్లడయినప్పుడు ప్రపంచమంతా ఆశ్చర్యచకితం కాగలదు. కాని దీనికోసం అందరు కలిసి కృషి చేయవలసిన అవసరం ఉంది. ప్రభుత్వానికి దేశవాసులకు, వైద్యప్రముఖులకు వినయ పూర్వకంగా మా విజ్ఞప్తి ఏమిటంటే – "అందరూ దీనిపై (ఆయుర్వేద వైద్యంపై) దృష్టిని సారించండి (శ్రద్ధ వహించండి) ఆయుర్వేద వైద్యాన్ని పరిరక్షించి, దానిని అభివృద్ధిపరచి, మీ కర్తవ్యాన్ని నెరవేర్చండి" –

ఇంగ్లీషు మందుల్లో తరచుగా మాంసం, ఎముకలలో ఉండే గుజ్జు పదార్థం, – క్రొవ్వు, గ్రంథులు, కల్లు వంటి అపవిత్రత, ఘృణిత పదార్థాలను కూడా వాడుతూంటారు. ఇవి అన్నివిధాలా అపవిత్రమైనవి,

హింసాపూర్వకమైనవి అందువల్ల అవాంఛనీయమైనవి కూడా. దేశవాసు లందరూ విదేశీయ ఔషధాలను ఎంతమాత్రమూ ఉపయోగించరాదు. చరకుడు, సుశ్రుతుడు, వాగ్భటుడు మొదలైన వారి ద్వారా రచింపబడిన ఆయుర్వేద శాస్త్రాలలో పేర్కొనబడిన వనస్పతి, ధాతువులు, రసాల వంటి పవిత్ర ఔషధ సేవనాన్నే దృఢనియమంగా చేసుకోండి. ఒకవేళ ఎవరికైనా పూర్తిగా అది సాధ్యం కాని పక్షంలో కనీసం వీలైనంత వరకూ ఇంగ్లీషు మందుల్ని వాడకుండా దేశీయ ఆయుర్వేద ఔషధాల్ని ఉపయోగించటానికే విస్తృతంగా ప్రయత్నించడానికి నిశ్చయించుకోండి. ఈ గ్రంథకర్తలు, ఔషధనిర్మాణకర్తలు - ఋషులు, త్రికాలజ్ఞులు అనుభవశాలురు. వారి అనుభవం, జ్ఞానం అలౌకికమైనది. అలాంటి అనుభవం వర్తమాన యుగానికి చెందిన మనుష్యుల్లో అసంభవమైనది. మనం ఆ ఋషుల అనుభవాన్ని, జ్ఞానాన్ని గౌరవించి దానినుండి ప్రయోజనం పొందాల్సి ఉంది.

## హిందూదేశం - హిందీభాష

మన భారతదేశం యొక్క పేరు మొదట్లో "ఆర్యావర్తం"గా ఉండేది. మనం ఇప్పుడు దాన్నే "హిందూదేశం"గా (హిందూస్థానంగా) పిలుస్తున్నాం. మహమ్మదీయ సోదరులు 'హిందూ' శబ్దాన్ని ఆక్షేపణగా (కాఫిర్ అని) ప్రయోగిస్తున్నారు. కాని మనకు 'హిందూ' శబ్దం పవిత్రమైన, గౌరవకరమైన విషయం. మనదేశానికి "హిందూదేశం" అనే పేరెందుకు వచ్చింది? అంటే హిమాలయంలోని "హి" బిన్దూలోని "న్దు" - ఈ విధంగా ఈ రెండింటిలోని ఆద్యంతాలలోని రెండక్షరాలు (శబ్దాలు) కలిసి హిందూ శబ్దం ఏర్పడింది. హిమాలయం నుండి తీసుకోవడంలోని అంతరార్థం - ఉత్తరాన నెలకొన్న గౌరీశంకరపర్వతం (హిమగిరి) అని - అలాగే 'బిందూ'లోని అంతరార్థం తూర్పుపడమరలతో కూడిన దక్షిణ మహాసముద్రం అని - అలాకాకుండా మరోలాగా "హిమాలయం" లోని "హి" - "సిన్ధూ" (సముద్రం) లోని "ఇన్ధూ" కలిసి "హిన్ధూ" శబ్దం ఏర్పడిందని భావిస్తే - దానికి అపభ్రంశ శబ్దంగా "హిందూ" శబ్దాన్ని తీసుకోవచ్చు. హిమాలయం నుండి ప్రారంభించి

దక్షిణ సముద్రం వరకూ ఉన్నదేశం పేరు "హిందూదేశం". ఆ దేశంలో నివసించే జాతి "హిందూ"జాతి. వారిభాష హిందీ. వారి మతాన్నే హిందూమతం (హిందూధర్మం)గా పిలుస్తారు. వారి ఆచారవ్యవహారాలు, వేషధారణలను "హిందూసంస్కృతి" అని పిలుస్తారు. వీటన్నిటి పరిరక్షణ వల్లనే హిందూజాతి, హిందూధర్మాల పరిరక్షణ జరుగ గలదు.

కాబట్టి హిందూదేశంలో నివసించే సోదరులు తమ పరిరక్షణకోసం తమ హిందూదేశ భాష, వేషధారణలు, ఆహార వ్యవహారాలు, ఆచార వ్యవహారాలనే తమవిగా ఉంచుకోవాలి. విదేశీ ప్రభావానికిలోనై వీటిని ఎప్పుడూ మార్చరాదు. తన సంస్కృతిని విడనాడి పరజాతీయ సంస్కృతిని తనదిగా చేసుకొనే జాతి నష్టపోతోంది.

మన ప్రాచీన భాష సంస్కృతం. ప్రస్తుత భాష హిందీ. అలాగే మనలిపి దేవనాగరి. మన ప్రాచీన భాష సంస్కృతం రాజభాష కాలేనప్పుడు హిందీ అయినా తప్పనిసరిగా రాజభాష కావాలి. అలాగే హిందీభాషను అభివృద్ధి చేయాలి. శ్రుతి, స్మృతి పురాణేతిహాసోక్తంగా అనాదిగా వస్తున్న సనాతన ధర్మమే మన ఆర్యజాతి హిందూదేశస్థుల సనాతన హిందూధర్మం. కనీసం తమ హిందూదేశంలోనైనా మన హిందూధర్మం, హిందూజాతి, హిందీభాష, హిందూసంస్కృతి స్థిరంగా ఉండేలా ప్రతిభారతీయ సోదరుడూ, సోదరీమనీ ప్రయత్నించాలి!

## భగవద్గీత - రామాయణముల ప్రచారం

సంస్కృతంలో శ్రీమద్భగవద్గీత, హిందీలో గోస్వామి శ్రీతులసీదాసకృత "రామచరితమానస్" ఈ రెండూ ఉత్తమ విద్యనందించే సర్వోత్తమ గ్రంథాలు. వీటి కనుగుణంగా ఆచరించే మనిషి జీవితం ఉచ్చకోటికి చెందినదగుతుంది. ఈ రెండు గ్రంథాలను మహాత్మాగాంధీజీ సైతం బహుధాప్రశంసించారు. వీటిని యావత్ప్రపంచానికి ఉపయోగపడే గ్రంథాలుగా పేర్కొన్నా అతిశయోక్తి కాదు. వీటి శైలి బహు సుందరమైనది. వీటిలోని శ్లోకాలు, ఛందస్సులు,

చౌపాఈలు, దోహాలు మొదలైనవి కావ్యదృష్టితో చూసినప్పటికి కూడా అత్యంత రసమయమైనవి, మధురమైనవి, సుందరమైనవి, పరమ పవిత్రమైనవి. అందువల్ల ఈ రెండు గ్రంథాలకు సార్వజనికప్రచారం అత్యంతావశ్యకం. శ్రీమద్భగవద్గీత మీద లభించినన్ని వ్యాఖ్యానాలు, భాష్యాలు, అనువాదాలు మరే ఇతర సంస్కృత, హిందీ భాషాగ్రంథాలకు లభించలేదు. దీనినిబట్టి ఇవి ఉచ్చకోటికిచెందిన గ్రంథాలని, సాంప్రదాయికులంతా వీటిని తమ స్వంతం చేసుకొన్నారని, భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో వీటికి గౌరవం ఉందని స్పష్టమవుతోంది. ఇదే విధంగా విదేశాలలో సైతం వీటికి మంచి ఆదరణ ఉంది. రామచరితమానస్‌కు హిందీ వాఙ్మయంలో అన్నింటికంటె అగ్రస్థానం ఉంది. భారత దేశంలోని అన్ని ప్రాంతాలలోను సమాదరం ఉంది. విదేశాలలోని ప్రజలు కూడా దీనిని గౌరవిస్తున్నారు. ఇప్పుడు రష్యన్ భాషలో దీని అనువాదం జరిగింది. శ్రీమద్భగవద్గీత, శ్రీరామచరిత మానస్‌ల ప్రచురణకు గీతాప్రెస్, గోరఖ్‌పూర్‌లో కూడా ప్రథమస్థానం ఇవ్వబడింది. ఈ రెండు గ్రంథాలను అధికసంఖ్యలో ప్రచురించి చౌకధరలకు ఇవ్వడం జరుగుతోంది.

గీత, రామాయణాలలో బాలబాలికలకు విశేష జ్ఞానం కలిగించే ఉద్దేశ్యంతో "గీతారామాయణ పరీక్షాసమితి" అనే పేరుతో ఒక ప్రత్యేక సంస్థ నిర్వహించబడుతోంది. దీనికోసం వేరు వేరు పరీక్షలు ఏర్పాటు చేయబడ్డాయి. వందలాది పాఠశాలలు, కళాశాలల్లో వీటికి సంబంధించిన పరీక్షలుంటాయి. కొన్ని చోట్లయితే వీటి అధ్యయనం తప్పనిసరి కూడా చేశారు. ఈ పరీక్షలకు సంబంధించిన ఇతోఽధిక వివరాలు కావలసిన వారు "గీతా రామాయణ పరీక్షాసమితి" నియమావళిని గీతాభవన్, స్వర్గాశ్రమం (ఋషికేశ్) 249 304 (యు.పి.) నుండి హిందీ లేదా ఇంగ్లీష్‌లో జాబువ్రాసి తెప్పించుకొని తెలుసుకోవచ్చు.

పాఠశాలలను, ఉన్నత పాఠశాలలను, కళాశాలలను ప్రారంభించిన సోదరులకు, లేదా ఆ సంస్థలలో తమ సహాయ సహకారాలందించే వారికి,

ప్రభుత్వం వారికి మా విన్నపమేమిటంటే - వారు తమ తమ సంస్థలలో గోరఖ్ పూర్, గీతా ప్రెస్సు వారిచే నిర్వహించబడే గీతా రామాయణ పరీక్షలను నిర్వహించండి! బాలబాలికలు దీనివల్ల కలిగే ప్రయోజనాల నుండి దూరం కాకుండా చూడండి!

ఇదే విధంగా మానవులందరి ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని ఒక విభాగం "గీతారామాయణ - ప్రచారసంఘం" పేర ఏర్పాటుచేయబడింది. దీనిలో గీతావిభాగంలో ఐదు విధాలైన, శ్రీరామాయణ విభాగంలో మూడు విధాలయిన సభ్యుల్ని తయారు చేస్తారు. ఏ వర్ణానికి చెందిన వారైనా, ఏ జాతి, ఏ ఆశ్రమ స్త్రీ, పురుషులైనా, బాల బాలికలైనా, యువకులైనా, వృద్ధులైనా సరే అందరూ ఇందులో సభ్యులు కావచ్చును. సభ్యుల నుండి ఎట్టి రుసుము (ఫీజు) వసూలు చేయబడదు. ప్రేమ పూర్వకంగా (భక్తిగా) గీతారామాయణాల పారాయణం, అధ్యయనమే ఇందులో చెల్లించవలసిన సభ్యత్వరుసుము. ఇప్పటివరకూ కొన్ని వేలమంది సభ్యులయ్యారు. ఇంకా సభ్యులుగా చేరుతున్నారు. సభ్యుల వివరాలు ఈ క్రింద ఇవ్వబడుతున్నాయి. వాటిని పాఠకులు చదివి అర్థం చేసికొని వాటిని ఇంటింటికి ప్రచారం చేయాల్సి ఉంటుంది.

శ్రీగీతా విభాగంలో చేరిన సభ్యులు ఈ క్రింద పేర్కొన్న ఐదు విధాలుగా ఉంటారు:-

1. ప్రతిరోజూ భవద్గీత సంపూర్ణంగా (18 అధ్యాయాలు) అర్థం మీద దృష్టినుంచుతూ ప్రేమ పూర్వకంగా ఒకసారి పారాయణము చేసే వాళ్ళు.

2. ప్రతిరోజూ గీతలోని 9 అధ్యాయాల చొప్పున అర్థం మీద దృష్టి పెట్టి భక్తితో, శ్రద్ధతో పారాయణము చేసే వాళ్ళు.

3. ప్రతిరోజూ భగవద్గీతలోని 6 అధ్యాయాల చొప్పున అర్థం మీద దృష్టితో (అర్థం చేసుకొంటూ) భక్తితో పారాయణము చేసేవాళ్ళు.

4. పది పేనురోజుల్లో సంపూర్ణంగా భగవద్గీతను భక్తితో (ప్రేమపూర్వకంగా) అర్థసహితంగా ఒక పారాయణము చేసే వాళ్ళు. ఈ విధంగా సంవత్సరానికి 24 పారాయణాలు అర్థసహితంగా చేసే వారు.

5. భగవద్గీతానుసారంగా జీవితాన్ని మలుచుకోవడానికి "గీతా తత్త్వ వివేచనీటీక"ను ప్రతిరోజూ కనీసం ఒక గంట గాని, రెండు శ్లోకాలను లోతుగా పరిశీలించటం గాని చేయాలి. (ఐదో రకానికి చెందిన సభ్యులు గీతాధ్యయనం చేసే వాళ్ళను, లోతుగా అర్థ విచారణతో చేయగలవారిని తయారు చేయాలి.)

గీతా పారాయణం చేసే ప్రతి సజ్జనుడికి మా విజ్ఞప్తి - వీలయితే ప్రతిరోజూ గీతాప్రెస్సు ద్వారా ప్రకాశితమైన "గీతాతత్త్వ వివేచనీ టీకా" గ్రంథమునుండి రెండు శ్లోకాలను భావసహితంగా, శ్రద్ధా భక్తి పూర్వకంగా చదివి వాటిని మననం చేయండి.

శ్రీరామాయణ విభాగంలో చేరే సభ్యులు మూడు విధాలుగా ఉంటారు –

1. ప్రతిరోజూ నవాహ్న పారాయణ పద్ధతిలో "శ్రీరామచరితమానస్"ను అర్థం మీద దృష్టి పెట్టి భక్తితో పారాయణము చేసే వాళ్ళు.
2. ప్రతిరోజూ మాస పారాయణ పద్ధతిలో అర్థం మీద దృష్టిపెడుతూ భక్తితో (ప్రేమపూర్వకంగా) పారాయణము చేసే వాళ్ళు.
3. ప్రతిరోజూ కనీసం ఏడుదోహాలను (చౌపాఈల సహితంగా) భక్తితో అర్థసహితంగా పారాయణము చేసే వాళ్ళు. – ఈ ప్రకారంగా సంవత్సరంలో సంపూర్ణ రామాయణాన్ని అర్థ సహితంగా కనీసం రెండు పార్లు పారాయణము చేసే వాళ్ళు.

పైన పేర్కొన్న రెండు విభాగాలలోగాని, ఏ ఒక్క విభాగంలో గాని సభ్యులు కాగోరేవారు "గీతారామాయణ ప్రచార సంఘం", గీతాప్రెస్సు,

గోరఖ్ పూర్ 273 005 (యు.పి.) – పేర హిందీ లేదా ఇంగ్లీష్‌లో జాబురాసి దరఖాస్తు పత్రాలను తెప్పించుకోవచ్చును.

వీటిలోని అర్ధసహిత గీతారామాయణ పారాయణం వల్ల అత్యంత అధిక ప్రయోజనం కలుగుతుంది. ప్రతి నిత్యం గీతాధ్యాయాలు పద్దెనిమిదింటిని కేవలం శ్లోకాలతోనే పారాయణం చేసే సోదరుని కంటే అర్థ సహితంగా లోతైన భావాలపై దృష్టినిల్పి కేవలం ఒక అధ్యాయాన్ని నిత్యపారాయణము చేసేవాడు ఉత్తముడు. ఇంకా కనీసం ఒక శ్లోకానికైనా అర్థతాత్పర్యాలను అవగతం చేసికొని, దాని ప్రకారంగా భక్తి, జ్ఞాన, వైరాగ్య, సదాచార యుక్తంగా తన జీవితాన్ని తీర్చి దిద్దుకొన్నవాడు సర్వోత్తముడు.

ఇదే విధంగా సంపూర్ణ రామాయణ మూల పాఠాన్ని పారాయణము చేసే వానికంటే, అర్థ తాత్పర్యాలను అర్థం చేసికొని మూలాన్ని పారాయణం చేసే వాడు లేదా భావాన్ని తెలుసుకొని అర్థ సహితంగా పారాయణం చేసే వాడు ఉత్తమోత్తమ శ్రేణికి చెందుతాడు. రామాయణం యొక్క అర్థతాత్పర్యాలను తెలుసుకొని యథాశక్తి దానికనుగుణంగా తన జీవితాన్ని మలుచుకొన్నవాడు పైన పేర్కొన్న వారికంటే గూడా శ్రేష్ఠుడు.

కాబట్టి గీతా రామాయణాల పారాయణానికి కావలసిన నియమాన్ని యథాశక్తిగ పాటించాలని, అలాగే దాని అర్థ తాత్పర్యాలను తెలుసుకొని తదనుగుణంగా జీవితాన్ని తీర్చిదిద్దుకోవటానికి విశేష ప్రయత్నం చేయాలని పాఠకులకు, పాఠకురాండ్రకు అందరికీ మా ప్రార్థన.

ఉపర్యుక్తమైన గీతా రామాయణాలు రెండూ ఆధ్యాత్మిక దృష్టిలో మిక్కిలి లాభదాయకమైన విషయాలే! దానితోపాటు సంస్కృతం, హిందీ–జ్ఞానదృష్టితో, బుద్ధి సంబంధమైన, నైతిక, సామాజిక, వ్యావహారిక ప్రయోజనాల దృష్టితో కూడా బహుధా ఉపయోగకరమైనవే! కాబట్టి సాంప్రదాయిక దృష్టిని విడనాడి అందరూ బౌద్ధిక, నైతిక, సామాజిక వ్యావహారిక ప్రయోజనాపేక్షతో వీటిని ప్రచారం చేయుండని అటు ప్రభుత్వానికి, ఇటు భారతీయ సోదర సోదరీమణులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

# 5. అన్ని వర్ణాశ్రమాల్లో ముక్తి

సన్న్యాసాశ్రమంలోనే ముక్తి లభిస్తుందనీ, గృహస్థాశ్రమంలో కాదని చాలా మంది సజ్జనులంటారు. కాని వారు చెప్పిన విషయం ఎంతవరకు సముచితమన్నది మనకర్థం కాదు. ఎందుచేతనంటే శ్రుతి, స్మృతి పురాణేతిహాసాలను పరిశీలిస్తే అన్ని వర్ణాశ్రమాల్లోనూ ముక్తి కలుగుతుందని అర్థమవుతుంది. ముక్తి విషయంలో వర్ణాశ్రమాలకు గాని, జాతికి గాని ప్రాధాన్యం లేదు. సద్గుణ, సదాచార భగవద్భక్తులకు జ్ఞానానికి మాత్రమే ప్రాధాన్యం ఉంది. ఈ విషయం శాస్త్రసమ్మతమైందీ, యుక్తి యుక్తమైంది కూడా.

ఒకవేళ ముక్తి జ్ఞానం వల్లనే లభిస్తుందన్నట్లయితే – "ఋతే జ్ఞానాన్న ముక్తిః" – ఈ సిద్ధాంతానుసారం నిష్కామకర్మ, ఈశ్వరభక్తి వంటి సాధనల ద్వారా ముక్తి లభించదని చెప్పడం సముచితం కాదు. ఎందుకంటే ఏ పరమాత్మ జ్ఞానం వల్ల ముక్తి కలుగుతుందన్నారో, ఆ జ్ఞానం నిష్కామకర్మనాచరించటం వల్ల అంతఃకరణ శుద్ధి జరిగిన మీదట దానంతటదే లభిస్తుంది.

భగవద్గీతలో భగవానుడిలా పేర్కొన్నాడు –

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।**

**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥** (4/38)

"ఈ ప్రపంచంలో జ్ఞానంతో సరితూగే పవిత్రమైన వస్తువు నిస్సందేహంగా మరొకటి లేదు. అట్టి జ్ఞానాన్ని ఎంతకాలం నుండో కర్మయోగం ద్వారా శుద్ధాంతః కరణుడైన మానవుడు తనంతతానే ఆత్మయందు పొందుచున్నాడు"

ఇదేగాక భగవద్గీతలో ప్రతిచోటా నిష్కామకర్మవల్లనే ముక్తి కలుగుతుందని చెప్పబడింది. [ఉదా:- 2/51; 3/19; 5/11,12 మొ॥]

నిష్కామకర్మ వల్లనే అంతఃకరణ శుద్ధిజరిగి దానంతటదే జ్ఞానం సిద్ధించి ముక్తి కలిగేటప్పుడు, భగవద్భక్తి ద్వారా జ్ఞానం సిద్ధించి ముక్తి కలుగుతుందని ఇంక చెప్పాల్సిందే ముంటుంది?

శ్రీమద్భగవద్గీతలో స్వయంగా భగవానుడిలా అన్నాడు -

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥**
**తేషామేవానుకంపార్థం అహమజ్ఞానజం తమః।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥** (10/10,11)

"నా మీదనే నిరంతరం మనసు నిలిపి ప్రేమపూర్వకంగా నన్ను సేవించే భక్తులకు (తత్త్వజ్ఞానరూప) బుద్ధి యోగాన్ని ప్రసాదిస్తాను. ఆ జ్ఞానంతో వాళ్ళు నన్ను చేరగలుగుతారు. హే అర్జునా! ఆ భక్తులను అనుగ్రహించడం కోసమే వారి అంతఃకరణలో వుండే స్వయంగా అజ్ఞానం వల్ల కలిగిన అంధకారాన్ని తత్త్వజ్ఞాన రూపమైన దీపంతో రూపుమాపెదను"

అలాగే భగవానుడు తొమ్మిదో అధ్యాయం 32 వ శ్లోకంలో ఇలా పేర్కొన్నాడు -

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః తేఽపి యాంతి పరాంగతిమ్॥**

"ఓ అర్జునా! నన్ను ఆశ్రయించిన వాళ్ళు వారు పాపజన్ములైన స్త్రీలైనా, వైశ్యులైనా, శూద్రులైనా ఎవరైనప్పటికీ పరమ శాంతి పదాన్ని పొందుతారు -"

భగవద్భక్తి వల్ల స్త్రీ, వైశ్య, శూద్రాది పాపజన్ములకి కూడా పరమగతిని పేర్కొన్నప్పుడు గృహస్థాశ్రమం ద్వారా ముక్తి లభించదన్నమాట ఎలా

కుదురుతుంది? భగవద్భక్తుల్ని ఆశ్రయించడం వల్ల కూడా నిమ్న జాతి మనుష్యులకు కలిగే సౌభాగ్యానికి సంబంధించిన విషయం శ్రీమద్భాగవతంలో ఇట్లు ప్రస్తావించబడింది –

**కిరాతహూణాన్ధ్రపులింద పుల్కసా**
**ఆభీర కంకా యవనాః ఖసాదయః।**
**యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః**
**శుధ్యన్తి తస్మై ప్రభవిష్ణవే నమః॥** (శ్రీమద్భా: 2/4/18)

"ఎవని ఆశ్రిత భక్తుల ఆశ్రయాన్ని పొంది కిరాత, హూణ, ఆన్ధ్ర, పులిన్ద, పుల్కస, ఆభీర, కంక, యవన, ఖసాది అధమ జాతి జనులూ, ఇంకా వారి కంటే కూడా మహాఘోర పాపులైన మానవులు సైతం పవిత్రులవుతున్నారో అట్టి జగత్ప్రభువు, విష్ణుభగవానునికి నమస్కరిస్తున్నాను."–

– మరి అలాంటప్పుడు భగవంతుణ్ణే శరణు జొచ్చి ఉద్ధరింపబడే విషయంలో ఇంకా చెప్పాల్సింది ఏముంటుంది? (చూడండి: గీత 18:62)

సర్వవర్ణాశ్రమాలలో భక్తి, జ్ఞాన, నిష్కామ భావాది సకల సాధనల ద్వారా ముక్తి లభిస్తుందని శాస్త్రములలో చెప్పబడింది. దీనికి సంబంధించిన అనేక ఉదాహరణలు వేద పురాణేతిహాసాలలో కనిపిస్తాయి.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకమహర్షి తన కుమారుడు శ్వేతకేతునికి జ్ఞానోపదేశం చేసి ఆతణ్ణి ఉద్ధరించాడు. జాబాలి పుత్రుడైన సత్యకాముడు గుర్వాజ్ఞాపాలనం ద్వారా బ్రహ్మచర్యాశ్రమంలో ఉంటూనే బ్రహ్మజ్ఞానియై బ్రహ్మత్వాన్ని పొందాడు. అలాగే సత్యకాముని శిష్యుడు ఉపకోశలుడు కూడా బ్రహ్మచర్యాశ్రమంలోనే గురుసేవవల్ల బ్రహ్మత్వాన్ని పొందాడు. ఇదే విధంగా రాజర్షియైన అశ్వపతి, జనక మహారాజు స్వయంగానే ముక్తి పదాన్ని పొందారు. వారి వద్ద మహర్షులు, మహా మునీశ్వరులు కూడా జ్ఞాన భిక్షకోసం వెదుతూండేవారు. ముక్తిని కూడా పొందుతూండేవారు. అశ్వపతి మహారాజు వద్దకు వెళ్ళి ప్రాచీన శాలుడు మొదలైన ఋషులు జ్ఞానాన్ని పొంది, ముక్తిని కూడా పొందారు.

యాజ్ఞవల్క్య ఋషినుండి ఆయన ధర్మపత్ని మైత్రేయి జ్ఞానాన్ని పొందింది. జనకమహారాజు నిండుసభలో బ్రహ్మవేత్తల సమావేశంలో యాజ్ఞవల్క్య ఋషిని ప్రశ్నించిన వచక్నుని పుత్రిక గార్గి స్వయంగా జీవన్ముక్తురాలైంది. వీరి వృత్తాంతం బృహదారణ్యకోపనిషత్తులో మనం చూడవచ్చు.

యమధర్మరాజు నుండి ఉపదేశాన్ని పొంది నచికేతుడు జీవన్ముక్తుడైన ఉదంతం కఠోపనిషత్తులో ప్రస్తావించబడింది.

మాతాపితరుల సేవద్వారా మూక చండాలుడు, పాతివ్రత్యపాలనం ద్వారా శుభానామధేయి అయిన ఒకమహిళ, న్యాయయుక్తమైన సత్యనిష్ఠాగరిష్ఠతతో క్రయవిక్రయాలు జరిపిన తులాధారుడనే వైశ్యుడు, ఉత్తమగుణాలతో అద్రోహకుడనే సజ్జనుడు, భగవద్భక్తితో వైష్ణవుడు పరమగతిని పొందారు. వీరి వృత్తాంతం పద్మపురాణంలోని సృష్టి ఖండంలో బహు విస్తారంగా ప్రస్తావించబడింది. ఇవి తప్పక పరిశీలించదగినవి.*

మహారాజు చోళుడు, విష్ణుదాసుడనే బ్రాహ్మణుడు కూడా భగవద్భక్తి ద్వారా పరమపదప్రాప్తిని పొందారు. ఈ కథ పద్మపురాణంలోని పాతాళ ఖండంలో కనిపిస్తుంది. రాజా అంబరీషుడు, భీష్మపితామహుడు భగవద్భక్తి ప్రభావం వల్ల భగవత్ప్రాప్తి పొందిన ఘట్టం శ్రీమద్భాగవతంలో కనిపిస్తే పరమ భక్తులైన అర్జున ద్రౌపదుల పరమపదప్రాప్తికి సంబంధించిన వర్ణన మహాభారతంలోని స్వర్గారోహణ పర్వంలో మనకు కనిపిస్తుంది. మార్కండేయ పురాణంలో భగవతి దుర్గోపాసన ద్వారా సమాధివైశ్యుడు పరమపదప్రాప్తిని పొందిన కథ ఉంది. మహాభారతంలో మనకు కనిపించే లోమహర్షణుడు, ఉగ్రశ్రవుడు, సంజయుడు, విదురుడు భగవద్భక్తి ద్వారానే పరమాత్మన్ని చేరుకొన్నారు. బోయజాతిస్త్రీ శబరి భగవద్భక్తిని సాధించి భగవత్ప్రాప్తిని పొందిన కథ మనకు రామాయణంలోని అరణ్యకాండలో కనిపిస్తుంది.

* వీని కథలనుగూర్చి "కోడ్ నెం 689 భగవానుని అయిదు నివాస స్థానాలు" అను పుస్తకమును చదవండి!

ఈ విధంగా అన్ని వర్ణాశ్రమాలలో అనేకమంది స్త్రీపురుషులు కర్మోపాసనాది యోగసాధనల ద్వారా పరమపద ప్రాప్తి పొందిన వర్ణనలు, వృత్తాంతాలు శాస్త్రగ్రంథాలలో ఎక్కడ చూసినా మనకు విరివిగా లభిస్తాయి. ఎన్నని పేర్కొనగలము!

పైన తెలిపిన ఉదాహరణల్లో ఎక్కువమంది గృహస్థాశ్రమ వాసులే! మరి అలాంటప్పుడు వానప్రస్థాశ్రమ వాసులకు, సన్యాసులకు సుఖసౌభాగ్యాలు లభిస్తాయని చెప్పేదేముంది? ఇతర ఆశ్రమవాసులందరి పోషణ గృహస్థాశ్రమంద్వారా జరుగుతుంది. ఇందువల్లనే పురాణాల్లో అక్కడక్కడ గృహస్థాశ్రమాన్నే అన్యాశ్రమాలకంటే శ్రేష్ఠమైనదిగా పేర్కొన్నారు. కాబట్టి గృహస్థాశ్రమంలోనే ఉండి తమ తమ వర్ణధర్మాన్ని నిష్కామ భావంతో ఆచరిస్తూ పరమాత్ముని యెడల అనన్య భక్తిని కలిగి ఉన్న స్త్రీపురుషుల ముక్తి విషయంలో సందేహ పడనవసరం లేదు. శ్రీ స్కాందపురాణంలోని మాహేశ్వర ఖండంలో మహాత్ముడైన నందభద్రుడనే వైశ్యుడి మహామహిమాన్విత గాథ ఒకటుంది. దీనిలో తన వర్ణధర్మాన్ని నిష్కామభావంతో ఆచరించడం, సకలధర్మాల వాస్తవిక సారతత్త్వాన్ని అవగతం చేసికొని అన్నింటిని ఆదరించడం, అలాగే సదాశివ భగవానుని యెడల అనన్య భక్తిని కలిగి ఉండటం అనే ఈ మూడు ప్రత్యేకతలు సంతరించుకొని ఉన్నాయి. వీటి విస్తృత వర్ణనలు స్కాందపురాణంలోని మహేశ్వర ఖండాంతర్గత కుమారికా ఖండంలోని 40–41వ అధ్యాయాల్లో గమనించవచ్చును. ఇక్కడ పాఠకులు తెలుసుకోడానికి వీలుగా దానిని సంక్షిప్తంగా కొంత ప్రత్యక్షీకరించడం జరుగుతోంది.

నందభద్రుడనే పేరుగల ఒక వైశ్యుడుండేవాడు. ఆయన సాక్షాత్తు ధర్మరాజులాగా, సమస్తధర్మ తత్త్వ రహస్యాలను ఎరిగినవాడు. ఆయన అందరి యెడల స్నేహంతో ఉండేవాడు. సదా సర్వుల హితసాధనలో నిమగ్నమై ఉండేవాడు. మనో వాక్కాయ కర్మలద్వారా ఈ పరోపకార ధర్మాన్నే ఆశ్రయించి ఉండేవాడు. నందభద్రుడు ఈ విశాల ధర్మసముద్రాన్ని అన్నివైపుల నుండి మథించి సారతత్త్వాన్ని గ్రహించాడు.

ఆయన జీవనం కోసం న్యాయసమ్మతమైన వాణిజ్యాన్ని ఉత్తమమైనదిగా భావించి దానిని తనదైనదిగా మలుచుకొన్నాడు. ఆయన కొద్దిగా కొయ్యముక్కలు, ఆకులు అలములతో తననివాసం కోసం ఇంటిని ఏర్పరచుకొన్నాడు. అందరిమేలుకోసం, తన శరీర పోషణార్థం తక్కువ లాభాన్ని తీసికొని వ్యాపారం చేస్తూండేవాడు. ఆయన క్రయవిక్రయాలు చేసే వస్తువుల్లో మద్యం సర్వదా నిషిద్ధంగా ఉండేది. ఆయనలో వినియోగదారుల యెడల భేదభావం ఉండేదికాదు. సమత్వ వ్యవహారమే జరుగుతూండేది. మోసం, దగాలు మచ్చుకైనా కనబడేవి కావు. వస్తువుల ఆదానప్రదానాలలో ఆయన అందరితోనూ ఒకేరకమైన వ్యవహారమే నడిపేవాడు. కపటం లేకుండా ఇతరుల నుండి ఖరీదు చేసిన వస్తువులను మోసం లేకుండా అందరికీ సమానభావంతో అమ్ముతూ ఉండేవాడు. ఇదే ఆయన శ్రేష్ఠవ్రతంగా ఉండేది.

కొంతమంది యజ్ఞాల గురించి కీర్తిస్తారు. కాని నందభద్రుడు మాత్రం అలా అనుకునేవాడు కాదు. ఆయన శ్రద్ధాపూర్వకంగా దైవపూజ చేయడం, నమస్కారం, స్తుతి, నివేదనలు వంటి యజ్ఞానికి సంబంధించిన సారభూత విషయాలను ఎల్లప్పుడు పాటిస్తూ ఉండేవాడు. మరికొందరు సన్న్యాసాన్ని గురించి కీర్తిస్తారు. కాని నందభద్రుడు మాత్రం వారితో ఎప్పుడూ ఏకీభవించే వాడు కాదు. ఆయన కథనం ప్రకారం, విషయాలను బాహ్యంగా పరిత్యజించినా, మానసికంగా వాటిని గురించిన చింతనలో ఉండేవాడు, అటుగృహస్థధర్మాన్నీ ఇటు సన్న్యాసాన్ని ఇంకా ఇహపరలోకాలకు ఉభయత్రా భ్రష్టుడై చిన్నాభిన్నమైన మేఘంలాగా నష్టపోతాడు. సన్న్యాసం యొక్క సారభూతమైన ఉత్తమ తత్త్వం ఏదైతే ఉందో దాన్ని నందభద్రుడు కూడా ఆదరిస్తూండేవాడు.

ఆయన ఎవరికర్మల్నీ నిందించడం గాని, శ్లాఘించడం గాని చేస్తూండేవాడు కాడు. ఎవరియెడల ఆయనకు రాగద్వేషములుగాని, అనురోధవిరోధములుగాని ఉండేవి కావు. రాయిని, బంగారాన్ని కూడా సమంగానే భావించేవాడు.

అలాగే తనను గురించిన నిందాస్తుతులు రెంటియందు సమభావాన్నే కలిగియుండే ఆయన సహజంగానే ధీరుడు. సకల ప్రాణుల యెడల నిర్భయంగానే ఉండేవాడు. తన ఆకృతిని అంధునివలె, బధిరునివలె అంటే ఇతరుల దోషాలను చూడకుండా, వినకుండా ఉండేవాడు. కర్మల ఫలితాన్ని గూర్చిన ఆకాంక్ష ఆయనకుండేది కాదు. కాబట్టే ప్రతికర్మ ఆయన విషయంలో సదాశివభగవానుని ఆరాధనలోని అంగంగానే (భాగంగానే) ఇమిడి ఉండేది. ఈ కారణంగా ఆయన ధర్మానుష్ఠానాన్నైతే కోరి చూస్తూండే వాడేగాని దానిలో స్వార్థబుద్ధి ఏమాత్రం ఉంచుకొనేవాడుకాదు. నందభద్రుడు చక్కగా విచారణ చేసి మోక్షప్రాప్తికి సారభూతమైన ధర్మాన్ని స్వీకరించాడు.

కొందరు వ్యవసాయాన్ని గురించిన ప్రశంస చేస్తారు. కాని నందభద్రుడు దానిలోని సారభూతమైన విషయాన్ని తన సొంతం చేసుకొన్నాడు. వ్యవసాయానికి సంబంధించిన ఆదాయంలో 30వ వంతు భాగాన్ని వదులుకొని దానిని ధర్మకార్యాలలో వెచ్చించాలి. వృద్ధ పశువుల పోషణభారం స్వయంగా వహించాలి. అలా చేసేవాడే ఉత్తముడైన వ్యవసాయదారుడు. నందభద్రుడు వ్యవసాయానికి సంబంధించిన సారంగా భావించి దీనినే ఆదరించేవాడు.

ప్రతిరోజూ తన శక్త్యనుసారం దేవతలకు, పితరులకు, మానవులకు (అతిథులకు), బ్రాహ్మణులకు, క్రిమికీటకాదులకు, పశుపక్ష్యాది సర్వభూతాలకు అన్నదానం చేయాలి. ఎల్లప్పుడు వీరందరికి ఇచ్చిన తరువాతనే తాను భోజనం చేయడం సర్వదా యోగ్యమైనది. ఇది ఆయన మతంగా ఉండేది.*

---

* **భగవద్గీతలో కూడా భగవానుడు అలాగే సెలవిచ్చారు:-**

**యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।**

**భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మ కారణాత్॥** (3:13)

**" - యజ్ఞంలో మిగిలిన అన్నాన్ని భుజించే శ్రేష్ఠ పురుషులు సకల పాపాల నుండి విముక్తులవుతారు. అలాకాకుండా తన శరీరపోషణ కోసమే అన్నాన్ని వండుకొనే పాపాత్ములు పాపాన్నే తినుచున్నారు. (వారు తినేది పాపమేగాని అన్నం కాదు)"**

కొంతమంది ఐశ్వర్యాన్ని గురించిన ప్రశంస చేస్తారు. కాని సందభద్రుడు ఆ ప్రశంస యోగ్యమైనదిగా భావించేవాడు కాదు. ఎందువల్లనంటే ఐశ్వర్యవంతుడైన వాడు తనని శాశ్వతుడిగా భావించుకొని ఇతరులయెడల దుర్వ్యవహారాన్నే నడుపుతాడు. వాస్తవానికి ధనమదోన్మత్తుడైనవాడు పతితుడై వివేకాన్ని కోల్పోతాడు. కాబట్టి సకల ప్రాణుల యందు తన ఆత్మనే గుర్తించి వాటియెడల తనలాగే ప్రవర్తించాలి.*

---

* శ్రీమద్భగవద్గీతలో కూడా భగవానుడు అర్జునుడుతో ఇలా అన్నాడు -

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ (6:29)
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ (6:32)

– "అర్జునా! సర్వవ్యాప్తమైన అనంత చైతన్యంలో ఐక్యస్థితి రూపమైన యోగంతో కూడిన ఆత్మవంతుడు, సర్వులను సమభావంతో దర్శించు యోగి, ఆత్మను సకల భూతాలలో మంచులోని నీటిలాగా వ్యాపించినట్లు దర్శిస్తాడు. అలాగే సకల భూతాలను తన ఆత్మలో సందర్శిస్తాడు. అనగా స్వప్నం నుండి మేల్కాంచిన (మేలుకొన్న) పురుషుడు స్వప్న ప్రపంచాన్ని తన అంతర్గత సంకల్పం ఆధారంగా దర్శించినట్లు సకల భూతాలను సర్వవ్యాప్తమైన అనంత చైతన్యమైన తన అంతరాత్మ సంకల్పం ఆధారంగా దర్శిస్తాడు." –

– "అర్జునా! సమస్త భూతాల యందు తనలాగే సమదృష్టి కలిగి సమస్త జీవుల సుఖదుఃఖాలను అందరితోను సమంగా దర్శించే యోగి పరమశ్రేష్ఠుడిగా భావించబడతాడు."–

"తనలాగే సమదృష్టి కలిగి"--- అనడంలోని భావం - "మనిషి, తన శిరస్సు, కాళ్ళు, చేతులు, ఆసనం (గుదం) మొదలైన అవయవాలతో బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర, మ్లేచ్ఛ జాతి వారి వలె వ్యవహరిస్తూ కూడా వారిలో ఆత్మీయతను చూసినట్లుగా అనగా ఆత్మీయత సమానంగా ఉండటం ద్వారా వారి సుఖదుఃఖాదులను సమంగానే చూసినట్లుగా సర్వభూతాలలోను దర్శించాలి –"

సర్వత్రా ఆత్మదృష్టి కలవాడు ఐశ్వర్యమత్తుడు కానేరడు. కాబట్టి వారు తమశక్త్యనుసారంగా సర్వప్రాణులకు సేవ చేస్తూంటారు. ఎవరికి సేవచేయాలన్న విముఖులు కారు. ఇట్టి ఆచరణ మగ్నుడైన సాధుశిరోమణి నందభద్రుని సద్వ్యవహారాన్ని దేవతలు కూడా కోరేవారు.

నందభద్రుడుండే ఊళ్ళోనే ఆయన పక్కయింటిలో ఒక శూద్రుడు కూడా నివసిస్తూ ఉండేవాడు. అతని పేరు సత్యవ్రతుడే గాని, అతడు పరమనాస్తికుడు. ఇతనిలో (నందభద్రునిలో) ఏమాత్రం దోషం కనిపించినా అతని ధర్మం నుంచి పడగొడదామని అతనికి కోరికగా ఉండేది. నందభద్రుడికి వృద్ధాప్యంలో ఒకపుత్రుడు కలిగాడుగాని ఆ పిల్లవాడు మరణించాడు. దీనిని ప్రారబ్ధఫలంగా భావించి మహామతియైన ఆ వైశ్యుడు దుఃఖించలేదు. తదనంతరం పతివ్రతమైన అరుంధతిలాగా, సాధ్వీమణుల సమస్తసద్గుణ సంపన్నురాలైన నందభద్రుని పత్ని 'కనక' హఠాత్తుగా మరణించింది. సత్యవ్రతుడికి చాలా రోజుల తరువాత చాలా సంతోషం కలిగింది. "పాపం! పెద్ద కష్టమొచ్చి పడింది!" అంటూ అతడు శీఘ్రంగా నందభద్రుని వద్దకు వచ్చాడు. స్నేహితునిలా అతణ్ణి సమీపించి ఇలా అన్నాడు – "నందభద్రా! నీవంటి ధర్మాత్ముడికి సైతం ఇలాంటి ఫలమే కలిగినప్పుడు ఈ ధర్మకర్మలన్నీ వ్యర్థమే అని నాకనిపిస్తోంది. నేను వాక్కుకు సంబంధించి పద్దెనిమిది దోషాలు, బుద్ధికి సంబంధించి తొమ్మిది దోషాలు లేకుండా సర్వథా నిర్దుష్ట వాక్యాలను పలుకుతాను*

* సూక్ష్మత, సంఖ్య, క్రమం, నిర్ణయం, ప్రయోజనం – ఈ ఐదింటి అర్థం దేనిలో ఉపలబ్ధమవుతుందో దానిని "వాక్యం" అంటారు. ధర్మార్థకామమోక్షాలను ఉద్దేశించి చెప్పబడే వాక్యాన్ని "ప్రయోజన" వాక్యం అంటారు. ధర్మార్థకామమోక్షవిషయాలలో ప్రతిన బూని వాక్యోపసంహారంలో "ఇదీ అని" (ఇదే అది అని) చెప్పే విశేషంగా సిద్ధాంతీకరిస్తే దానిని "నిర్ణయ" వాక్యం అంటారు. "ఇది ముందు చెప్పాలి – ఇది తరువాత చెప్పాలి" – అంటూ క్రమవిభాగం చేసి ప్రస్తుత విషయాన్ని ప్రతిపాదించిన పక్షంలో ఆ విషయాన్ని వాక్యతత్త్వం తెలిసిన విజ్ఞులు, విద్వాంసులు "క్రమం" అని పిలుస్తారు. గుణదోషాలను

యథాతథంగా విభాగించి రెంటికీ ప్రమాణాలు చూపెట్టినట్లయితే దానిని "సంఖ్య" అనే వాక్యంగా గుర్తించాలి. అలాగే వాక్యంలోని విభిన్నార్థాలలో అభేదం కనబడినపుడు, అధికంగా కనబడే ఆ అభేదజ్ఞానానికి గల కారణాన్ని "సూక్ష్మత" అంటారు. ఇప్పటివరకూ వాక్యానికి సంబంధించిన గుణగణనం (మదింపు) చేయడం జరిగింది.

వాక్కుకు సంబంధించిన అష్టాదశ దోషాలు ఈ విధంగా గ్రహించాలి.

(1) అపేతార్థం (2) అభిన్నార్థం (3) అప్రవృత్తం (4) అధికం (5) అశ్లక్ష్ణం (6) సందిగ్ధం (7) పదాంతాక్షరం గురువు (8) పరాఙ్ముఖ-ముఖ (9) అనృతం (10) అసంస్కృతం (11) త్రివర్గ విరుద్ధం (12) న్యూనం (13) కష్టశబ్దం (14) అతిశబ్దం (15) వ్యుత్క్రమాభివృత (16) సశేషం (17) అహేతుకం (18) నిష్కారణం. –

ఉచ్చరించాక కూడా అర్థజ్ఞానాన్ని ఇవ్వలేని వాక్కును "అపేతార్థం" అంటారు. అర్థభేదం యొక్క స్పష్టమైన జ్ఞానం కలగని వాక్కు "అభిన్నార్థం" – అవుతుంది. ఎల్లప్పుడు వ్యవహారంలోనికి రాని శబ్దాన్ని "అప్రవృత్తం" అని పిలుస్తారు. ఒక వాక్కుగాని, శబ్దంగాని లేకపోయినప్పటికి వాక్యార్థం బోధపడినట్లయితే ఆ వాక్కును, శబ్దాన్ని "అధికం" అంటారు. అస్పష్టమైన లేదా అనాగరికమైన వాక్కును "అశ్లక్ష్ణం" అంటారు. సందేహమైన అర్థాన్నందించే వాక్కును "సందిగ్ధం" అంటారు. పదాంతంలోని అక్షరాన్ని "గురవు"లాగా ఉచ్చరించటం కూడా ఒక దోషమే!

వక్త తాను వ్యక్తం చేయదలచుకొన్న అర్థం కంటే విపరీతార్థాన్నిచ్చే వాక్కును (విపరీతార్థంలో బోధపడే) వాక్కును "పరాఙ్ముఖ-ముఖ" అని అంటారు. 'అనృతం' అంటే అసత్యం అని అర్థం. వ్యాకరణ సిద్ధంగాని (వ్యాకరణయుక్తంకాని) వాక్కును 'అసంస్కృతం' అంటారు. ధర్మార్థకామాలను గురించిన విరుద్ధాలోచనను ప్రకటించే వాక్కును "త్రివర్గవిరుద్ధం" అని అంటారు. వాక్కులో అర్థబోధకు పర్యాప్తమైన శబ్దం లేకుండా ఉండటం "న్యూన" దోషం. ఉచ్చారణ క్లేశంగా ఉన్నట్లయితే దానిని "కష్టశబ్దం" అంటారు. సంపూర్ణ అతిశయోక్తి యుక్తమైన శబ్దాన్ని "అతిశబ్దం" అంటారు. క్రమాన్ని ఉల్లంఘించి శబ్ద ప్రయోగం జరిగినప్పుడు దానిని "వ్యుత్క్రమాభివృత" అని పిలుస్తారు. వాక్యం పూర్తయినప్పటికి విషయం పూర్తి కానట్లయితే అందలి దోషాన్ని "సశేషం"

శాస్త్రజాలం నుండి విడివడి మిధ్యావాదాలను విడిచిపెట్టి కేవలం సత్యాన్ని పలకడమే నా వ్రతం. కాబట్టే నన్ను "సత్యవ్రతుడం"టారు. నేను నీతో యథార్థ విషయం చెబుతాను."

"– నీవు రాయికి (శివలింగానికి) పూజ ప్రారంభించినప్పటి నుండి ఏవిధమైన సత్ఫలమూ నీకు లభించినట్లుగా నేనెప్పుడూ చూడలేదు. ఒక్కగానొక్క కొడుకు మరణించినాడు. పతివ్రతయైన భార్యకూడా ఆ విధంగానే పరమపదించింది. సోదరా! ఇక దేవతలెక్కడున్నారు? అంతామాయ. నిజంగా వాళ్ళుంటే కనబడరే! ఇదంతా దగాకోరు బ్రాహ్మణుల అసత్యకల్పన. ఈ ప్రపంచ సృష్టి, ప్రళయము రెండూ అసత్య విషయాలే! ఈ ప్రపంచం స్వాభావికంగానే ఎల్లప్పుడూ ఉంటోంది. ఈ సూర్యాది గ్రహాలు స్వాభావికంగానే పరిభ్రమిస్తున్నాయి. స్వాభావికంగానే పృథ్విస్థిరంగా ఉంది. స్వాభావికంగానే సముద్రం తన హద్దుల్లో ఉంది.

---

అనవచ్చు. చెప్పబడిన అర్థాన్ని సాధించటానికి తగిన తర్కం, యుక్తి లేనప్పుడు అందరి దోషాన్ని "అహేతుక" దోషం అని పేర్కొంటారు. ఏదైనా మాట చెప్పడంలోని ఏదో ఒక కారణాన్ని చెప్పజాలనప్పుడు లేదా ఏదైనా శబ్దాన్ని ప్రయోగించినప్పుడు దానికి తగిన కారణం లేనప్పుడు అక్కడి దోషం "నిష్కారణం" అనే దోషంగా చెప్పవచ్చు.

కామ, క్రోధ, భయ, లోభ, దైన్యం, కుటిలత, దయాహీనత, గౌరవహీనత, ధర్మహీనత – ఇవి తొమ్మిది బుద్ధికి సంబంధించిన దోషాలు. వక్త, శ్రోత, వాక్యము – వ్యవస్థితమై (తారుమారు కాకుండా) భాషణంలోని ఆకాంక్షల్లో సమానమైన స్థితిని సాధించినప్పుడు వక్తయొక్క అభిప్రాయం యథాతథంగా ప్రకటితమవుతుంది. సంభాషణ చేసేటప్పుడు వక్త, శ్రోతను అవహేళన చేసినా లేదా శ్రోతయేవక్తను ఉపేక్షించినా పలికిన వాక్యం బుర్రకెక్కదు (బుద్ధికెక్కదు) సత్యాన్ని పరిత్యజించి తనకుగాని, శ్రోతకుగాని ప్రియం కలిగించే మాటలు పలికితే, అప్పుడు ఆ వాక్యం మీద సందేహం కలుగుతుంది కాబట్టి ఆ వాక్యం కూడా దోషయుక్తమైనదే అవుతుంది. కాబట్టి తనకుగాని, శ్రోతకుగాని ప్రియం కలిగించే మాటలు మాని కేవలం సత్యాన్ని పలికేవాడే ఈ భూమి మీద యథార్థవక్త అవుతాడు – తప్ప మరొకడు కాడు.

స్వాభావికంగానే పెక్కు జీవులు ఉత్పన్నమవుతాయి. స్వాభావికంగానే సమస్త జగత్తు ప్రకాశితమవుతుంది. దీనిని ప్రత్యక్షంగా చూపించగల కర్త (ఈశ్వరుడు) ఎవడూ లేడు."-

"ధూర్తజనులు మానవయోనిని కూడా సర్వశ్రేష్ఠమైన దానిగా పేర్కొంటారు గాని మనుష్యయోనిని మించి మరేయోని లోనైనా పెద్ద ఇబ్బందేమీ ఉండదు. పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు బంధనమేమీ లేకుండానే సౌఖ్యమైన విహారం చేస్తాయి. వీటి యోని అత్యంత దుర్లభమైంది. మనుష్యుల యోని నుండి గాక మరే ఇతర యోనుల నుంచైనా ఉద్భవించే సర్వజీవులూ ధన్యమైనవే! కాబట్టి నందభద్రా! నీవు మిథ్యాధర్మాన్ని పరిత్యజించి, ఆనందంగా తింటూ, తాగుతూ, ఆడుతూ పాడుతూ భోగాలను అనుభవించు. ఈ భూమి మీద ఇదే సత్యం!"

అమంగళంగా, యుక్తి రహితంగా, అసమంజసంగా (దోషభూయిష్ఠంగా) ఉన్న సత్యవ్రతుని వచనాలను విని, మహాబుద్ధి శాలియైన నందభద్రుడు లేశమైనా చలించలేదు. ఆయన కల్లోలం లేని సముద్రం లాగా గంభీరంగా ఉన్నాడు. ఆయన చిరునవ్వుతో ఇలా బదులు పలికాడు - "సత్యవ్రతా! ధర్మాత్ములెప్పుడూ దుఃఖభాగులవుతారని మీరన్నమాట అబద్ధం. పాపాత్ములు కూడా అనేక విధాల దుఃఖితులవటం మనం చూస్తున్నాం. సంసార బంధం ద్వారా జనించే క్లేశాలు, దారాపుత్రాదుల ద్వారా కలిగే కష్టాలు, పాపాత్ముల విషయంలోనూ కనిపిస్తూనే ఉన్నాయి. కాబట్టి నా అభిప్రాయంలో ధర్మమే శ్రేష్ఠమైంది."

"ఇక మీరన్న రెండో విషయానికొస్తే ఈ ప్రపంచానికి కారణభూతుడైన మహిమాన్వితుడైన పరమాత్ముడు లేడన్నది కూడా పసిపిల్లల మాటలాంటిది. ప్రజలు లేని రాజుండ గలడా? ఇంకానేను అసత్యమైన శిలాపూజ చేస్తున్నానని పలికిన మాటకు సమాధానంగా నేను విన్నవించాల్సింది ఉంది. అదేమిటంటే మీకు శివలింగం యొక్క మహిమ తెలియదు. అది గూడా ఎలాగంటే అంధుడైనవాడు సూర్యుని స్వరూపాన్ని చూడలేనట్లుగానే

మీరు శివలింగ మహిమను ఎరుగరు. శ్రీరామచంద్రుడు సముద్రపుటొడ్డున శ్రీరామేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడుగదా! ఇది బూటకం, అబద్ధం అంటారా?"

"ఇంకా మీరు చెప్పిన విషయం ఒకటుంది. దేవతలు లేరని ఒకవేళ వారున్నట్లయితే కంటికి కనబడరేమిటని? మీ ప్రశ్న వల్ల నాకు మహాశ్చర్యం కలుగుతోంది. దరిద్రులైనవారు గుమ్మం గుమ్మానికి వెళ్ళి యాచించినట్లుగా దేవతలు కూడా మీ వద్దకు వచ్చి యాచించాలంటారా? ఇంకా మీ అభిప్రాయం ప్రకారం సర్వపదార్థాలు స్వాభావికంగానే సిద్ధిస్తాయంటున్నారు గదా! అలాయితే కర్త అంటూ ఒకడు లేకుండా భోజనం దానంతటదే ఎందుకు తయారు కావడం లేదు? కాబట్టి నిర్మాణ కార్యమేదైనా సరే! అది అవశ్యం ఎవరో ఒకరు కర్తగా జరిగిందే కావాలి. (కర్త చేత చేయబడిందే అవ్వాలి.) అయ్యో! ఇంకా మీరు చెప్పిన విషయం; పశుపక్ష్యాది ప్రాణులు సుఖంగా ఉంటాయని, అవి ధన్యజీవులని మీరన్నమాట మీరు తప్ప మరెవ్వరూ చెప్పలేదు. వినలేదు. తమోగుణం కలిగినవి, అనేక ఇంద్రియాలు లేనివి అయిన పశుపక్ష్యాది ప్రాణులు, వాటి కష్టాలు కూడా రమణీయమైనవి, ధన్యమైనవి అయ్యే పక్షంలో సకలేంద్రియాలతో శోభిల్లే మనిషి శ్రేష్ఠుడూ, ధన్యుడు ఎందుకు కాకుండా పోతాడు? ఇంతకీ నాకర్థమైందేమిటంటే మీలోని అద్భుత సత్యవ్రతం నరకానికి సోపానంగా సంపాదించుకున్నట్లుంది! తమరు మొదట్లోనే ఆడంబరమైన భూమికతో మీ పాండిత్యాన్ని పరిచయం చేయడం (చేసుకోవడం) ఆరంభించినప్పుడే ఆ వచనాలలోని సారహీనత తేటతెల్లమైంది. ఇంకా మీరు ప్రవచించటానికి ప్రతిజ్ఞకూడా చేశారు. ఇంకా చెప్పాల్సింది కూడా చెప్పనే చెప్పారు. ఇందులో నిజానికి మీదోషమేమీ లేదు! మీరు చెప్పిందంతా వినడమనే దోషమంతా నాదే! నాస్తికుడు, సర్పం, విషం వీటిస్వభావమే అంత! అవి ఇతరుల్ని మోహితుల్ని చేస్తాయి. ప్రతిరోజు సాధుపురుషుల సాంగత్యం చేయడం, ధర్మం కోసమే! కాబట్టే విద్వాంసులు, పెద్దలు, పవిత్రభావసంపన్నులైన

మునులు, శాంతి పరాయణులైన సత్పురుషుల తోడి సాంగత్యం (సంపర్కం) ఏర్పరచుకోవాలి. దుష్ట పురుషుల (జనుల) దర్శనం, స్పర్శనం, సంభాషణం, వారితో ఒకే ఆసనంపై కూర్చోవడం, కలిసి భోజనం చేయడం, వీటన్నిటివల్ల ధార్మికాచారం నశించి పోతుంది. నీచులైన వారితో చేసే సాంగత్యం వల్ల కూడా పురుషుల బుద్ధి నష్టమైపోతుంది. మధ్యమశ్రేణికి చెందిన వారితో కలిసి తిరగడం వల్ల బుద్ధి మధ్యమస్థితిని పొందుతుంది. ఉత్తములైన వారితోడి సమాగమం వల్ల బుద్ధి శ్రేష్ఠమైన దవుతుంది. ఈ ధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని నేను మళ్ళీ మిమ్మల్ని కలవడానికి ఇచ్ఛగించడం లేదు. ఎందుకంటే మీరు సదా బ్రాహ్మణాదుల నిందచేస్తున్నారు. వేదాలు ప్రమాణాలు, స్మృతులు ప్రమాణాలు అలాగే ధర్మార్థ యుక్తమైన వచనాలు ప్రమాణాలు. కాని ఈ మూడు ప్రామాణికం కాని దృష్టికలవాడి మాటలు ప్రామాణికంగా ఎవరు గుర్తిస్తారు?"

ఈ విధంగా పలికి మహాత్ముడైన నందభద్రుడు అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయాడు. అయన ఎల్లప్పుడు మహేశ్వరోపాసనలో నిమగ్నుడై ఉంటూ ఆ విధంగా శివభక్తి పరాయణుడై ఉంటూనే పరమపదించాడు.

భక్తి సహితమైన నిష్కామకర్మ విషయంలో శాస్త్రాలు చెప్పిన విధి వాక్యం కూడా ఉంది. దీన్ని భగవానుడు భగవద్గీతలో స్వయంగా పేర్కొన్నాడు

**స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।**
**స్వకర్మ నిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥**
**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥** (18: 45,46)

"తమతమ స్వాభావిక కర్మలయందు తత్పరులైన మనుష్యులు భగవత్ప్రాప్తి రూపమైన సిద్ధిని పొందుతారు. స్వాభావిక సిద్ధమైన తన కర్మయందు నిరతుడైనవాడు, ఏ విధంగా సిద్ధి పొందుతాడో చెబుతాను విను."

"సమస్త ప్రాణుల పుట్టుకకు, పోషణకు కారణభూతుడై విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆ పరమాత్మను తమకు విధించిన స్వాభావిక కర్మలను ఆచరించడం ద్వారా అర్చించి మానవుడు పరమగతిని పొందుతాడు."

కావున మానవులందరు పరమాత్మశరణుజెంది తమ-తమ వర్ణాశ్రమ ములననుసరించి జగజ్జనార్దనుని సేవజేయుచూ, పరమాత్మ ప్రాప్తికొరకై ప్రాణపర్యంతము ప్రయత్నింపవలెను.

॥ హరిః ఓం తత్సత్ ॥

★ ★ ★